# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

## ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 41 | సంచిక 3

15 జూన్ 1952




సంపాదకులు :

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు

వ్యవస్థాపకులు :

శ్రీయుత ఉదర వెంకయ్యగారు.





V.S. GURU

# విషయసూచిక

# ఆంధ్రరాష్ట్ర
# ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 41] ఏలూరు, జూన్ 15 [సంచిక 3





**వివరణము :**

ఆ పరమాత్మ మనయందఱిలో నున్నాడు. దానితో మనము సంకోచమును, వ్యాకోచమును గూడ పొందవచ్చును. దివ్యదృష్టిలేకుండుట దౌర్భాగ్యమే. దాని నెవరును హరింపజాలరు. మన యంతరంగమున బుట్టుచుండు చెడుభావములే దానిని హరింపవలెను. అవియే మన సహజశత్రువులు. మనల నవియే మోసగించును.

**సంకీర్తనము :**

హే విశ్వప్రకాశీ ! నీ కాంతికిరణముల నాపై నొకింత ప్రసరింప నిమ్ము,
అన్నిటియందును వెలుగొందెడి నిన్ను గ్రహించుశక్తి నా కొసంగుము.
నా భావములు, నా యొనర్చు కర్మలు, నీ యిచ్ఛను అనుసరించుగాక !
అన్నివిధముల నిన్నే నే ననుసరించి నీ చెంతనే యుండుదును గాక !

స్వామి రామతీర్థ.

# శ్రీ నందననామ వత్సర ప్రసక్తి

నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి

(ఈ క్రింది పద్యములు ది 4-5-52 తేదీన శ్రీ వెలువలిపల్లి సెంటర్ క్లాసు వార్షికోత్సవ సందర్భమున పఠింపబడినవి).

క. గందర గోళము పడు మన
డెందము లందున్న వెతల డిందు పఱచగా
నందన నామక వత్సర
మందముగా నేగుదెంచె హర్షం బొసగన్.

ఉ. పోయిన వత్సరత్రితయమున్ గలిగించె విశత్పరంపరల్
హాయి యెఱుంగ రేమనుజు లారయ మచ్చునకైన నింక మీ
వోయి సునందనాబ్దమ! మహోన్నత సౌఖ్యము నిచ్చి యీయుపా
ధ్యాయులకెల్ల నీ వనిశ మల్లన దీర్పుము వీరికోరికల్.

సీ. బాగుగా మన లోటుపాటుల సత్ప్రభు, లరసెడు సుదినము లరయవచ్చె
సంస్థ లన్నిటియందు సమత జీతము లిచ్చి, యరసెడు సుదినముల్ దరియవచ్చె
సంఘ నాయకుల్ మన సద్బోధనాశక్తి, నరసెడు సుదినము లరయవచ్చె
వినతులై శిష్యులు మనల గౌరవముతో, నరసెడు సుదినము లరయవచ్చె
గాన విద్యుక్తధర్మముల్ క్రమత సల్పి, యిహపరంబుల కేలోటు నెసగకుండ
మార్గదర్శకులై మీరు మనుడు సతత, మమలమతులార ఓయుపాధ్యాయులార.

---

# శ్రీ మోక్షగుండ రామాయణము

## యక్షగానము (హరికథ)

(ఆరు కాండలుగల సంపూర్ణ రామాయణము)

ఖర సంవత్సరంలో —

# రాలిపోయిన తారలూ-
# ఆరిపోయిన జ్యోతులూ

(రచన: శ్రీ శీలా వెంకటప్ప)

లోకంలో యెందరో రాజులు రాజకీయ ధురంధరులు, సాహిత్యవేత్తలు, సంఘసేవకులు, యోగి పుంగవులు మొదలగువారు ఆవిర్భవిస్తూవుంటారు. అస్తమిస్తూ వుంటారుకూడ. కాని తమ భౌతిక దేహాల్ని కోల్పోయినంతమాత్రాన వారి కీర్తికాంత దిగంతములవరకు పరిభ్రమిస్తూనే వుంటుంది. ఆమహనీయుల పావన చరిత్రలను తెలిసికొని, వారు వెలిగించిపోయిన జ్యోతులు విశ్వమానవ ప్రపంచములో ఆరిపోకుండా చూడడం మన పవిత్రధర్మం. ఆధన్యజీవుల ధర్మపథాన పురోగమించడం అత్యావసరం.

## ౧. "శ్రీ విక్రమదేవవర్మ"

వీరు జయపుర సంస్థానాధీశ్వరులు. జననం 1870 సం. శ్రీ విక్రమదేవవర్మ 1930 లో సింహాసనం అధిష్ఠించిరి. వీరిసంస్థానం సాలీనా రాబడి 22 లక్షలు. అతి నిరాడంబరజీవనం గడిపేవారు. సనాతన ఆచార పరులు. ఎనభైయవ పడిలోకూడ కసరత్తు చేసేవారు. విసుగు విరామ మెంచనివారు

ఈయన సంస్థానాధినేతమాత్రమే కాక ఆంధ్రము ఒరియా, భాషల్లో సరసకవిత్వం చెప్పగల పండితుడు. ఆశుకవిత్వంతో దేవతల్నికూడ ఆరాధించేవారు. తెలుగుభాషలో శ్రీనివాస కళ్యాణము, మానవతీ చరిత్రము, బాలగోపాలశతకము, మొదలైనవి వ్రాశారు. ఓఢ్రభాషలోకూడ బుద్ధచరిత్రము, కళాపూర్ణోదయం, రాఘవపాండవీయం, మొదలైనవి వ్రాశారు. ఎన్నో తెలుగు, ఓఢ్ర గ్రంథాలకు పీఠికలు, వ్యాఖ్యానాలు, వ్రాసేవారు. అనేకమంది తెలుగుకవులు వ్రాసినగ్రంథాలను అంకితము పొంది, కవులను ఆదరించి భాషాసేవ చేసినారు.

శ్రీదేవవర్మగారు ఆంధ్రవిశ్వవిద్యాలయాభ్యున్నతికి మూలకారకులు. 1939 నుండి దీనికి ప్రోఛాన్సెలరుగా నుంటూ, తొలిసారిగ 50 వేలు రూపాయలును, తర్వాత యేటేట లక్షరూపాయలు, భూరి విరాళాన్ని ఇస్తున్నారు. యూనివర్సిటీలో విభాగాలైన ఫిజిక్సు, కెమిస్ట్రీ, టెక్నాలజీ కోర్సులను నెలకొల్పేందుకు ధనసహాయాన్ని చేసినారు. తన సతీమణి హీరాబాయి పేర మహిళలకు ఒక వసతి గృహమును నిర్మించుటకు నిధిని యేర్పాటుచేసినారు. ఓఢ్రభాష నిఘంటువు రచనకు 20 వేలు, హిందీ భాషాభివృద్ధికి 5 వేలు. రూ.లు నొసగి తమ దాతృత్వమును ప్రకటించుకొనిరి. యేటేటా పండితగోష్ఠి జరిపేవారు.

తన లక్ష్మిని సరస్వతీసేవకై వినియోగించిన ధన్యుడుగాబట్టే ఆంధ్రవిశ్వవిద్యాలయము వీరికి సాహిత్యకోవిద బిరుదము (డి.లిట్) నొసంగి గౌరవించినది.

జయపురం మహారాజు, ఆంధ్రవిశ్వవిద్యాలయం ప్రోఛాన్సెలర్, అయిన శ్రీ వి కమదేవవర్మగారు 1951 ఏప్రిల్ 14 వ తేది రాత్రి స్వర్గస్థులైరి.

"శ్రీ విక్రమదేవవర్మగారు ఆంధ్ర విశ్వవిద్యాలయాభ్యున్నతికి మూలపురుషులు. వారి మృతిచే సంస్థకు తీరనినష్టము వాటిల్లినది" అని శ్రీ డాక్టర్ వి. యస్. కృష్ణగారు సహితం తమ సంతాపాన్ని వెలిబుచ్చిరి. ఇట్టి మహామహుని నిర్యాణముతో ఆంధ్రవాఙ్మయమునకు తీరనిలోటుకలిగింది. ఆంధ్రావని వీరికి అంజలి అర్పిస్తుంది.

## ౨. "ఎర్నెస్ట్ బెవిన్"

ఎర్నెస్ట్ బెవిన్ 1881 మార్చి 9 వ తేదీన ఇంగ్లండులోని విన్స్‌ఫోర్డులో జన్మించాడు. బాల్యంలోనే తల్లిదండ్రులను గోల్పోయినాడు. మేనత్త పోషణలో పెరిగినాడు. కొంతకాలం హోటల్లో క్లీనర్‌గాను, కారుడ్రైవరుగాను, పనిచేసినాడు. ఈ కాలంలో వారానికి 10 షిల్లింగులు ఆర్జిస్తూవుండేవాడు.

బ్రిటన్ కార్మికోద్యమములో తన ఇరవయ్యో యేట ప్రముఖపాత్రను నిర్వహించి 18 సంవత్స

లను ఇంగ్లీషులోనికి అనువదించారు. అనేక గ్రంథాలకు పీఠికలు వ్రాశారు.

వీరి పాండితీ ప్రతిభలను గుర్తించి ఆంధ్ర విశ్వవిద్యాలయం "కళాప్రపూర్ణ" అను బిరుదముతో గౌరవించింది. 1947 లో కాశీ సంస్కృత విద్యాపీఠంవారు వీరిని "మహోపాధ్యాయ" బిరుదంతో సత్కరించారు.

నారాయణరావుగారితో ఎవరు యెప్పుడు మాట్లాడినా సాహిత్యకాలక్షేపమే నిన్న మొన్నటి వరకు విశాలాంధ్ర నిఘంటు నిర్మాణానికి, వ్యాకరణ రచనకు, లోకోక్తులు, సామెతలు, సేకరణకు, కృషి చేస్తుండెడివారు.

ఆంధ్రసారస్వతానికి తనజీవితం అంకితంచేసిన ఆదర్శపరిశోధకుడు, కళాప్రపూర్ణ, మహోపాధ్యాయ డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు (M. A. L. T. P. H. D.) 1951 జూన్ 23 వ తేదీ నిర్యాణం చెందడం మన దౌర్భాగ్యం. దురదృష్టం. వీరి సతీమణి శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు; నలుగురు కుమారులు, నలుగురు కుమార్తెలు, పలువురు బంధుమిత్రులు వున్నారు.

"ఆంధ్రరాష్ట్రం రావాలి వస్తుంది విశాలాంధ్ర భాషకు వ్యాకరణం వ్రాయాలి. విశాలాంధ్రకు నిఘంటువు తయారుచేయాలి" ఇవి వారు మరణశయ్యపై నున్నపుడు సన్నిపాతములో కలవరించిన మాటలు.

## ౫. గాయక సార్వభౌమ, శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య.

శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యగారు 1883 సం.లో జన్మించారు. వీరికి బాల్యంనుండి సంగీతమునందు అభిలాష మెండు. అనేక నాటకములందు తన పాత్రను చక్కగ నిర్వహించి పేరు ప్రతిష్ఠలు ఆర్జించారు. విజయవాడ రేడియో స్టేషనునుండి తన మధుర సంగీతాన్ని వినిపించి ఆంధ్రులను ఆనంద వీచికలలో ఓలలాడిస్తూండేవారు. ఆయన సంగీత గురువు శ్రీ సుసర్ల దక్షిణామూర్తి సహితం రామకృష్ణయ్యగారి గాన మాధుర్యాన్ని చవిచూచి ఆనందించేవారు. తే 7-7-51 సం. న గాయక సార్వభౌమ శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య తమ గురువు శ్రీ దక్షిణామూర్తిగారి 31 వ ఆరాధనోత్సవంలో పాల్గొనడానికిగాను స్నానంచేసి, బయలుదేర బోతూ, హఠాత్తుగా తన భౌతికదేహాన్ని విడిచారు. వీరివయస్సు 68 సం. లు. భార్య, కుమార్తె, మనుమలున్నారు.

విజయనగరం మహారాజాగారి సంగీత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ద్వారం వెంకటస్వామిగారు, శ్రీ వింజమూరి వరదరాజయ్యంగార్లు, తమ జోహార్లర్పిస్తూ "కర్ణాటక సంగీతాచార్యుడు, గాయకసార్వభౌమ శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యగారి మృతి వలన, ఆంధ్రదేశంలో కర్ణాటక సంగీతమునకు తీరని లోటు కలిగింది. అయినవారు మృతజీవులు" అని శ్లాఘించారు.

## ౬. శ్రీన్యాయపతి నారాయణమూర్తి

శ్రీ నారాయణమూర్తిగారు 1897 జులై 24 వ తేదీన బరంపురంలో జన్మించారు. 1921 లో పచ్చయప్ప కళాశాలలో B. A చదువుతూ, కాంగ్రెస్ ఆదేశానుసారం పరీక్షకు కూర్చోవడం మానేశారు. గంజాం జిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా, ఆంధ్రా కాన్ఫరెన్సుకుకూడ కార్యదర్శిగా, వుండినారు. 1922, 1930, 1932 లో మొత్తం నాలుగుసార్లు దేశసేవలో కృష్ణ జన్మస్థానాన్ని అలంకరించారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శిగా, అఖిల భారతకాంగ్రెస్ సంఘసభ్యుడుగా, కేంద్ర శాసన సభా సభ్యుడుగా, విశాలాంధ్ర మహాసభా ఉపాధ్యక్షుడుగా, అనేక పదవులను అలంకరించి ప్రజారంజకుడు డయ్యారు.

'ఆంధ్రవాణి', 'వాహిని', 'ఆంధ్రప్రభ', 'విజయప్రభ' 'జై భారత్' మొదలగు పత్రికలకు సంపాదకుడుగావుండి తన పదునైన కలముతో రచనలను సాగిస్తూ తెలుగునాట అమరకీర్తిని ఆర్జించారు.

సుప్రసిద్ధ దేశభక్తుడు, పత్రికా సంపాదకుడు, కళాభిజ్ఞుడు, ప్రియంవదుడు అయిన శ్రీ నారాయణమూర్తిగారు "కేన్సర్" వ్యాధితో మద్రాసులో 1951 జులై 13 వ తేదీ రాత్రి కాలధర్మంచెందారు. వీరి అకాల మరణంతో మన ఆంధ్రావనికి, పత్రికా ప్రపంచానికి, వీరి ఆలుబిడ్డలకు తీరనినష్టం కలిగింది. మరణకాలంనాటికి వీరివయస్సు 54 సం.లు. వీరికి భార్య, ముగ్గురుకొడుకులు, ముగ్గురుకూతుళ్లువున్నారు.

ఆంధ్ర ప్రజాపార్టీ నాయకుడు శ్రీ ప్రకాశం పంతులుగారు, ఇండియా పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి దుర్గాబాయమ్మగారు, శ్రీ న్యాయపతినారాయణమూర్తిగారి సేవనుఉగ్గడిస్తూ "దేశస్వాతంత్ర్యం కోసం మహత్త్యాగంచేసిన మహనీయుల్లో ఒకరనియు, తన కలాన్ని మహావాడిగా వుపయోగించడములో పిరికికండలేని మహాయోధు" డనియు, జోహార్లర్పించిరి.

# మన రాష్ట్రములో ప్రాథమికోపాధ్యాయుల దుర్భరస్థితి

రచన:—రామున్ని,
కార్యదర్శి :
తమిళనాడ్ ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్.

అనువాదం:— శీలా వెంకటప్ప,
టీచరు : బోర్డు సెంట్రల్ స్కూలు,
కమలాపురం P. O. కడపజిల్లా.

[మనరాష్ట్రములో సామాన్యమైన రోజుల్లోనే ప్రాథమికోపాధ్యాయుల స్థితిగతులు చాలాదుర్భరం. ఈ క్లిష్టరోజుల్లో వీరిజీవితం మరీ హీనాతిహీనం. "ఉపాధ్యాయవృత్తి వృత్తులన్నిటికంటె ఉన్నతమైనదే కాని, అన్నిటికంటె దైన్యమైనది". ఈ రహస్యం ప్రాచ్య పాశ్చాత్య దేశాల్లో అందరికీ తెలిసియుండినా కూడ, ఉపాధ్యాయ లోకాని కంతకూ వర్తించేదే. ఈ దేశపు టీచర్లకుగాని, లేక మరేదేశపు పంతుళ్ళకుగాని, లేదా కాలేజి, హైస్కూల్, ఎలిమెంటరీస్కూలు ప్రాథమికోపాధ్యాయులకుగాని, ఈ సమస్య క్లిష్టమైనదే.]

చెన్నరాష్ట్రములో ప్రాథమికోపాధ్యాయుల పరిస్థితి సుభిక్షమైనరోజుల్లోనే, ఎంతో కష్టమైనదిగా యుండి నిరుద్యోగులు, చిల్లరదుకాణాదారులకంటె కూడ చాలా హీనంగా వుండినది. ఇటీవల దుర్భర క్షామపరిస్థితుల్లో వీరిజీవితం చాలాదెబ్బతినింది. రాష్ట్రంలో మొత్తం ఉపాధ్యాయులు 1,10,000. వీరిలో ప్రాథమికోపాధ్యాయులు 85,000. 17% సెకండరీగ్రేడ్ వుపాధ్యాయులున్నూ, ట్రైనింగ్ అయిన పట్టభద్రులున్నూ, లోయర్‌గ్రేడ్ టీచర్లు 5% వున్నారు. (1951 లో)

ఒక ద్రవ్యసహాయాన్ని పొందే స్కూల్లో (Aided School) ఒక పట్టభద్రుడు పనిచేస్తే అతనిజీతం రూ 35-1-45 కరువుబత్తా 19 రూ. లు. ఇదే స్కూల్లో రెండేండ్లు తర్ఫీతు పొందిన ఒక లోయర్‌గ్రేడ్ ఉపాధ్యాయుడు పనిచేస్తే జీతం 20/- రూ.లు కరువుబత్తా ఇదేమాదిరిగా ఎయిడెడ్ పాఠశాలల్లో ఒక B. A. BT 54/ రూ.లున్నూ, లోయర్‌గ్రేడ్ వుపాధ్యాయుడు 39/-రూ.లున్నూ, సంపాదిస్తూ వున్నాడు. అయితే ఒకపని తెలియని వాడు యేమిల్లులోనో, కర్మాగారములోనో, 70 లేక 80 రూ.లు ఆర్జిస్తూ వున్నాడు.

అల్పసంఖ్యాకులుగా వుండే B. A. BT లు, లోయర్‌గ్రేడ్ టీచర్లను మినహాయించి, యిప్పుడు అధికసంఖ్యాకులుగా వుండే హైయ్యర్‌గ్రేడ్, సెకండరీగ్రేడ్ వుపాధ్యాయులనుగూర్చి చర్చించుదాం.

| గ్రేడ్ | మదరాసు కార్పొరేషన్ | గవర్నమెంటు | మునిసిపల్ & డిస్ట్రిక్టుబోర్డు | పంచాయతీబోర్డు ఎయిడెడ్ మ్యానేజిమెంట్లు |
|---|---|---|---|---|
| హయ్యర్ | 35-1-55 | 25-1-45 | 30-1-45 | 27-½-30 |
| సెకండరీగ్రేడ్ | 45-3-60-2-90 | 40-3-55-2-75 | 40-1½-55-2-75 | 31-5-45 |

మదరాసు ప్రభుత్వం మిషన్, పంచాయతీ, ఎయిడెడ్‌స్కూళ్ల మ్యానేజర్లను తమ స్కూళ్లల్లో పనిచేసే హయ్యర్, సెకండరీగ్రేడ్ టీచర్లకు కరువుగా 3/-రూ.లు, 5/-రూ.లు యివ్వమని నిర్బంధముగా ఆదేశించింది. కాని మ్యానేజర్లు ఇచ్చేది లేనిది తెలియదుకాని, ఇదిమాత్రం ఒక పెద్ద సమస్యగా పరిణమించి ఉపాధ్యాయలోకాన్ని కలవరపరిచింది. వివిధ మేనేజిమెంట్లు వారు తమ అశక్తత కొద్ది ఇవ్వలేమని ప్రభుత్వానికి యెన్నో టెలిగ్రాంలు, మెమొరాండములు, సమర్పించి,

స్వయంగా రాయబారాలుకూడ పోయినారు. ఫలితం లేనందువల్ల మలబారులో మేనేజర్ల యూనియన్ ద్వారా చాలా స్కూళ్లు మూసివేయబడినాయి.

## కరువుబత్తా - అంచెనా

నేటికరువు దినాల్లో ధరలు ఆకాశాన్ని అంటుకొంటూవుండినాకూడ, పంతుళ్ళకు యిచ్చే కరువుబత్తా యేమాత్రం సమానముగాలేదు. ప్రభుత్వ సంస్థలలోను, స్థానిక సంస్థలలోను రు. 40 లలోపు జీతాలు వచ్చే ఉపాధ్యాయులకు రు. 19 లున్నూ, రు. 40 లు పైగా వచ్చేవారికి రు. 22 లున్నూ, యేగ్రేడ్ వుపాధ్యాయులు వున్నాకూడ రు. 19 లు మాత్రమే కరువుబత్తా యిస్తున్నారు.

ప్రభుత్వం ఈ కరువుబత్తాను 1946 లో జీవన సూచికనుబట్టి (Living Index) నిర్ణయించింది. అప్పుడు 275 నుండి 300 పాయింట్లవరకు వున్నప్పుడు అమల్లో పెట్టింది. కాని 1951-1952 సం॥లో 360 నుండి 400 పాయింట్లవరకు వున్నాకూడా ఇదే కరువుభత్యాన్ని నిర్ణయించింది. పెరుగుదలను బట్టి మన వేతనాన్ని 49 నుండి రు. 80 ల వరకు పెంచవలసినాకూడ పెంచనేలేదు.

మదరాసు కార్పొరేషన్‌లోను, మరికొన్ని పెద్ద పట్టణాల్లోను, 5 నుండి రు. 7 ల వరకు ఇంటిబాడుగను ఇస్తున్నారు. మనరాష్ట్రంలో మొత్తం ఉపాధ్యాయులలో సగంమంది ప్రాథమికోపాధ్యాయులు ఎయిడెడ్ స్కూళ్ళలోను, 30% జిల్లాబోర్డు స్కూళ్ళలోను, పనిచేస్తూ రు. 49 లు నుండి రు. 50 లు మాత్రమే పొందుచున్నారు.

## ఉపాధ్యాయుని యొక్క కుటుంబపు బడ్జెట్

ఇప్పుడు ఒక ఉపాధ్యాయుని సరాసరి కుటుంబముయొక్క జీవితాన్ని గూర్చి, ఆలోచిద్దాం. అతని అనుదిన జీవితంలో కలిగే ఖర్చులను క్రింది ప్రణాళికలో చూస్తే తెలుస్తుంది.

| | | |
|---|---|---|
| 1. రేషన్ ప్రకారం ఇచ్చేబియ్యం గోధుమలు | ... | రు. 25-0-0 |
| 2. కాయగూరలు, బేడలు, కండిమెంట్సు కాఫీపొడి, తదితర వస్తువులు | ... | 40- 0-0 |
| 3. పాలు పెరుగు | ... | 22- 0-0 |
| 4. వేరుసెనగనూనె, కిరోసిన్ | ... | 8 10-0 |
| 5. వంటచెరుకు (6 గుండ్లు) | ... | 12 -0-0 |
| 6. చాకలి, మంగలి | ... | 5- 0-0 |
| 7. ఇంటి బాడుగ | ... | 20- 0-0 |
| 8. దుస్తులు | ... | 15 0-0 |
| 9. చిల్లర ఖర్చులు | ... | 25- 0-0 |
| | | రు. 172-10-0 |

ఇది ఒక ఉపాధ్యాయుని కుటుంబములో సరాసరి ఆరుగురికి జమకట్టివేసిన ఖర్చుల ఎస్టిమేట్. పై బడ్జెట్‌లో యేలాటిఅనవసరమైనవిలేవు. ఖరీదైనవి కూడలేవు. నేటికష్టపరిస్థితుల్లో యెంతటి ప్రతిభావంతుడైనా, విమర్శకాగ్రేసరుడైనా కూడ ఈ పట్టికను గురించి తక్కువగా చర్చించలేడు.

## కష్టాలు

చెన్న రాష్ట్రములో మొత్తం 50% ప్రాథమికోపాధ్యాయులకు వృద్ధాప్యంలో తగిన రక్షణకు యేలాటి రక్షణ వసతులను కలిగించలేదు. ప్రస్తుతం ఒక ప్రాథమికోపాధ్యాయుని వుద్యోగంనుండి తొలగించేందుకు మూడు నెలల నోటీసుతో యెన్ని యేండ్ల సర్వీసుగల వాని నైనను తొలగించవచ్చును.

నేడు 416 G. O. ప్రకారం ప్రాథమికోపాధ్యాయులు రాష్ట్ర, జిల్లా సంఘాలుగా యేర్పడి తమ ప్రాథమిక హక్కులకై పోరాడేందుకు హక్కులేదు.

కాని ఆయాతెగల టీచర్లుమాత్రం తాలూకా సంఘాలుగా యేర్పడి తమకోర్కెలను వెల్లడించవచ్చును.

(అంటే జిల్లాబోర్డు 'టీచర్లు' మునిసిపల్ టీచర్లు, ఎయిడెడ్ టీచర్లు, విడివిడిగా సంఘాలుగా యేర్పడవచ్చును.)

ఆయాతెగల టీచర్ల తాలూకా సంఘాలమించి, విద్యాశాఖా డైరెక్టర్ ఉత్తర్వుల ధిక్కరించి, జిల్లా రాష్ట్రసంఘాలు నెలకొల్పితే ఆయాసంఘాలసభ్యుల సర్టిఫికెట్లు రద్దుచేయబడుతాయి.

## ప్రచారం చేసేందుకుకూడ హక్కులేదు.

దాదాపు ఎనిమిది నెలలకు ముందు ప్రభుత్వం ఉపాధ్యాయులు సంఘాలు నిర్మించుకొనేందుకు, ప్రచారంచేసుకొనేందుకుకూడ, నిషేధిస్తూ ఉత్తర్వులను జారీచేసింది. ఇటీవల ఆంధ్రరాష్ట్ర టీచర్సు ఫెడరేషన్ కార్యదర్శి, కౌన్సిల్ సభ్యులు, అయిన శ్రీ సింగరాజు రామకృష్ణయ్యగారు ప్రభుత్వంపై హైకోర్టులో మనసంఘ స్వాతంత్ర్యముపై దావా వేసినపుడు 416 G.O. మీద హైకోర్టు జడ్జీతీర్పు నిస్తూ సంఘాలు నిర్మించుకొనేందుకు ఉపాధ్యాయు




'చిరంజీవి'

**కాకి-కూజా**

మండువేసవి గొంతుక ఎండి నీటి
కొఱకు గాలించి యొకచోట కూజ గాంచి
అడుగునను నీరముంట రాళ్ళందు వైచి
నీరు పైబడ కాకి యింపార ద్రావె.

**బాతు-బంగారు గ్రుడ్డు**

"ఒసగు బంగారు గ్రుడ్డిది యొకటియ యొక
దినమునకు; పొట్టలో నుంచుకొనియె పెక్కు;
కొందు నొక్కట"నను నాశ నొంది ముసలి
బాతుపొట్టను చీలిచి బావురు మనె.

**తోడేలు-కొంగ**

"గొంతుపడు దుమ్ము వెలిదీయగొప్పమేలు
సలుపు" దని యను తోడేలుపలుకు నమ్మి
కొంగ వెలిదీయ "నిను చంపకుండ విడచి
నాడ నిదె గొప్పమేలింక నరుగు" మనియె.

**నక్క-తాబేలు**

"నాదుచర్మము గట్టిది:- నీదు దంత
ములకు లొంగదు; నీటను ముంచ నాను"
ననెడి తనపల్కులను నమ్మి యటులొనర్చ
నక్క కాల్జారి తాబేలు చక్క బ్రదికె.

**మట్టికుండ-ఇత్తడిబిందె**

"నీవు నను తాకినను- లేక నేను నిన్ను
తాకినను కీడు నాకౌట తథ్య మగుట
వలదు నినుచేర నది" యంచు పలికి మట్టి
కుండ యిత్తడిబిందెను కూడ కేగె.

---

౬౨ వ పేజీ తరువాయి

లకు హక్కు గలదన్నారు. హైకోర్టు ఉపాధ్యాయుల పక్షాన అనుకూలంగా తీర్పునిచ్చినా కూడ ప్రభుత్వోద్యోగులు మాత్రం, సంఘనిర్మాణానికి, ప్రాథమిక హక్కులకై పోరాడే పంతుళ్లపై తీవ్ర చర్యలకు, దిగడం మిక్కిలి శోచనీయం.

### ప్రాథమిక హక్కులు:

ప్రభుత్వం మొన్న జరిగిన ఎన్నికలలో ఉపాధ్యాయుల నియోజకవర్గాల్లో ప్రాథమికోపాధ్యాయులు పాల్గొనేందుకు ఓటింగ్ హక్కు లేకుండా చేసింది. ఇంకా ఇతర హక్కులు కూడ లేకుండా చేసింది. 154 G.O. ప్రకారం ప్రభుత్వం గత నాలుగేండ్లనుండి, నూర్లకొలది ఉపాధ్యాయ కార్యకర్తల సర్టిఫికేట్లను రద్దుచేస్తూ తీవ్ర నిర్బంధానికి గురిచేసింది (రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొన్నారనే సాకుతో)

### జాతీయ విద్య:

మన రాష్ట్రములో స్కూళ్లకు పోయే బాల, బాలికలు దాదాపు ఏడుమిలియనులమంది వున్నారు. (6 సం. నుండి 12 సం. వరకు) ప్రభుత్వం రాష్ట్రములో నిర్బంధ విద్యను ప్రవేశపెట్టినట్లు ప్రచారం చేస్తున్నదేగాని, నిజంగా 35 లక్షలమంది నిరక్షరాస్యులు ఇంకా మిగిలేవున్నారు. మనదేశం పురోభివృద్ధి గాంచవలెనంటే, నిరక్షరాస్యత, అల్పవేతనాలు ప్రభుత్వంయొక్క వుదాసీనత, తొలగిపోవాలి. అప్పుడే విద్యాభివృద్ధిలో ముందంజవేస్తుంది.

### ఉపాధ్యాయుల కర్తవ్యము

ఈ తీవ్ర ప్రతిబంధకాల్ని తొలగించుకునేందుకు, మనహక్కులకై నిరంతరం పోరాడేందుకు, సుసంఘటితమైన సంఘాల్ని నిర్మించుకోవాలి. నిజమైన ప్రజాస్వామిక ప్రభుత్వం సుస్థిరంగా వుండేందుకు, సరియైన జాతీయ విద్యా సౌధాన్ని నిర్మించుకోవడం మనచేతిలోనే వున్నది.

(కాంగ్రెస్ వర్కర్స్ సౌజన్యంతో స్వేచ్ఛానువాదం)

# ప్రావిడెంటు ఫండురూల్సు

(1952 మే నెల తరువాయి)

తర్జుమాదారు - కొండ్రెడ్డి సూర్యప్రకాశం

(vi) భారతప్రభుత్వపుజామీను అప్పులలోగాని పోస్టుఆఫీసు క్యాషు సర్టిఫికెట్లలోగాని, లేక వారియే విధమగు ప్రభుత్వ అప్పులలోగాని, సొమ్ము నిలువ చేయుటకు దరఖాస్తుదారులు స్పష్టముగా యీదిగువ ప్రకారము తెలియచేయవలెను. (ఎ) చందా దారు యొక్క నిలువమొత్తము సొమ్మునుండి ప్రోవిడెంటు ఫండులో చేరు సమయమునకు ఆ సొమ్ము మొత్తము నకు వచ్చెడు వడ్డీతో సహా (ఏదైన వున్నచో) సొమ్ము దాచుకొన్నప్పటి నుండియు ఆ ఫండునుండి ఎంత మొత్తమును ఇన్వెస్టు చేయకోరుచుండెను ? అను విషయమును వ్రాయవలయును. మరిన్ని (బి) ప్రోవిడెంటు ఫండు స్కీముక్రింద తమకెంత నిలువ వల్లను, తమ తరపున తమయొక్క మేనేజరు నిలువచేసిన సొమ్ములవల్లను, వానిపైని వచ్చిన వడ్డీ వల్లను, అప్పటికి నిలవయున్న మొత్తములో తాము ఎంతతీసి కట్టదలచినదిన్ని వ్రాయవలయును.

(vii) చందాదారుయొక్క క్యాష్ సర్టిఫికెట్టు కాలపరిమితి పూర్తియైనపుడెల్లను, క్యాష్ సర్టిఫికెట్టువెనుక పీఠిని, తన మొత్తము సొమ్మును అందు కొనుటకుగాను, తనఎండార్సుమెంటును వ్రాయించి తీసికొనవలెను. పోస్టాఫీసు పంపుటకు ముందుగనే యీ పని చేయవలెను.

ఒక టీచరు అతనియొక్క-లేక ఆమెయొక్క-వ్రాత మూలకమగు కోరిక లేనపుడెల్లను, జిల్లా విద్యాశాఖాధికారి-లేక అధికారిణి - సంతకముపైన సర్టిఫికెట్లు డిస్చార్జి అగును. పిదప (పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకులో) టీచరుయొక్క ప్రోవిడెంటు ఫండు అక్కవుంటులో ఆ సొమ్మును కలిపి వేయుదురు.

జిల్లా విద్యాశాఖాధికారియొక్క-లేక అధికారిణి యొక్క-సంతకములేక అనుమతి సంతకము-సర్టిఫికెట్లపైనను, ట్రాన్సుఫరు దరఖాస్తులపైనను, అనగా రెంటిపైనను, చేయబడినచో యీమాదిరి సర్టిఫికెట్లు ట్రాన్సుఫర్లుగూడ అంగీకరింపబడును. ఒక చందా దారు పేరు మీదకొనబడిన క్యాష్‌సర్టిఫికెట్ల సొమ్ము చెల్లింపు తనయొక్క టీచర్సు ప్రోవిడెంటుఫండుఅక్కవుంటు కాకినిల్వనుబట్టి 9 వ నిబంధన 1 (బి) లో iii ప్రకారము ఏర్పాటు చేయబడును.

గమనిక:—చందాదార్లు తాత్కాలికముగా తమ నిలవ మొత్తములను పోస్టుఆఫీసు సేవింగ్సు బ్యాంకు అక్కవుంట్లలో యీదిగువ తెలిపినవానిలో గూడ నిలవచేసికొనుటకుగూడ అనుమతింపబడుచున్నారు. (1) డిఫెన్సుసేవింగ్సు సర్టిఫికెటురూల్సు ప్రకారం అనుమతింపబడిన ఎక్కువమొత్తమును నిలువచేసి కొనుటకు డిఫెన్సుసేవింగ్సు సర్టిఫికెట్లు కొనుటకున్ను (2) జాతీయనిలవధనపత్రనిబంధనల (నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్టురూల్సు) ప్రకారం 1943 సంవత్సరం అక్టోబరు 1 వ తేదీనుండియు నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు కొనుటకున్ను :

**10. నిలవచేసికొన్న సొమ్ముతీసుకొనుట:—**

డిపోజిటరు (చందాదారు) మరణానంతరంగాని, పూర్తిగా రిటైరు అయినపుడుగాని, లేక తనకు 60 సంవత్సరములు నిండినపుడుగాని, నిలవసొమ్మును పూర్తిగా తీసికొనుటకు అనుమతింపబడును. మరిన్ని పబ్లిక్ యిన్‌స్ట్రక్షను డైరక్టరుగారు తృప్తిపడి ఒప్పుకొన్నచో, యితర ముఖ్యకారణముల వలనగూడ సొమ్ముతీసుకొనవచ్చును. ఆకారణము లేవనగా

(ఎ) ఒక చందాదారు యీ టి. పి. యఫ్ స్కీములో చేరిన తేదిమొదలు పదియవ సంవత్సరము పూర్తికాకముందే తన ఉద్యోగమునకు రాజీనామా యిచ్చి తన టి. పి. యఫ్ అక్కవుంటు పూర్తిగా యిచ్చివేయ వలసినదని దరఖాస్తుచేసినచో తనకు రావలసిన నిలవ మొత్తములన్నియు (గవర్నమెంటు కంట్రిబ్యూషను సొమ్ముగూడ కలిపి) పూర్తిగా




'చిరంజీవి'

విమానం :—

ఆకాశమ్మున పక్షిలాగ తన
అందపురెక్కల నటునిటు చాపుక
అదిగో ఎగిరెడి విమానమూ
అందమైనదీ విమానమూ
గాలితరగలను తేలియాడుచూ
నీలిమబ్బులను మేలమాడుచూ
పర్వతాలు జలరాసులు దాటుక
పయనము చేసే వాయువిమానం.
వందలకొద్దీ మైళ్ళు గంటలో
వడివడి వాయువు దూసుక పోవుచు

స్వదేశానికీ విదేశానికీ
సన్నిహితత్వము కూర్చువిమానం.
గొప్పగొప్ప ఉద్యోగులు వణిజులు
తప్పనిసరి యగు ధనవంతులునూ
హాయిగ వడిగా పయనము సేయగ
అవకాశం బిడునట్టి విమానం.
దూరదూరముల వారినెల్లరను
చేరువగా చేకూర్చు విమానం
మందులాది అత్యవసరవస్తులు
తొందరజాబులు మోయువి-మా-నం-

౬౭ వ పేజీ తరువాయి

అందుకొనును. కాని కొన్ని తప్పనిసరి సందర్భములలో మాత్రము, జిల్లావిద్యాశాఖాధికారి-లేక అధికారిణి-యొక్క అంగీకారముతో ఆతడు తనకు రావలసిన ప్రభుత్వ కంట్రిబ్యూషను సొమ్మును గూడ కలిపి పుచ్చుకొనవచ్చును. అయితే ఫండు నుండి విరమించుటకు తగిన కారణము లున్నట్లు లిఖిత పూర్వకముగ రికార్డు చేయబడవలెను.

(బి) ఒక చందాదారు బలహీనత వలనగాని, స్వయంకృతాపరాధమువలనగాక, సరియగు కారణేతరములవలన అశక్తుడైనపుడుగాని, ఎంత సర్వీసులో నున్నను (సర్వీసు హెచ్చుతగ్గులతో నిమిత్తం లేకుండా) తనబాకీకి రావలసిన నిలవ మొత్తము లన్నియు పుచ్చుకొనగలడు. ఎప్పుడు దేహదార్ఢ్యము తగ్గినను, లేక తగ్గియుండక పోయిననుసరే, పూర్తి మొత్తము యిచ్చివేయబడును, గాని డిస్ట్రిక్టు ఎడ్యుకేషనల్ ఆఫీసరుగారు మాత్రము గవర్నమెంటు కంట్రిబ్యూషను సొమ్ముగూడ యిచ్చివేయవచ్చునని మాత్రము ఆమోదించవలెను. ఒక చందాదారు స్వయంకృతాపరాధమువలన శక్తి విహీనుడైనపుడు ఆతడు దాచుకొన్న సొమ్ముమాత్రమే పోస్టల్ వడ్డీతో సహా అతనికి యిచ్చెదరు.

(సి) ఒక చందాదారు: i ఉద్యోగమునుండి తొలగింప బడినపుడు, లేక బర్తరఫు చేయబడినపుడు, లేక- ii తన ఉద్యోగమునుండి తొలగించెదరని, లేక డిస్మిసు చేయుదురని, తెలిసికొని ముందుగానే తన పనికి రాజీనామాయిచ్చినపుడు; లేక- iii అవినీతికరములైన పనులు (నీతితప్పినపనులు) చేసినందువలన నేరస్థుడైనట్లు రుజువు అయినపిదప తన పదవినివిడిచి పెట్టినపుడును, గల సందర్భములలో ఆపనియిచ్చిన అధికారి (అనగా మేనేజరు, లేక కరస్పాండెంటు, మున్నగువారు) తాను తనవంతు చెల్లించిన కంట్రిబ్యూషను సొమ్మును, అందుపైన వచ్చెడు పోస్టల్ వడ్డీయున్ను, గవర్నమెంటు కంట్రిబ్యూషను సొమ్మున్ను, జిల్లా విద్యాశాఖాధికారి పాఠశాల మేనేజరుతో సలహాచేసి డిపాజిట్టు సొమ్ముయిచ్చుట నిలిపివేయవచ్చును. కాని అటువంటి చందాదారు తాను తనవంతు నిలవచేసికొన్న డిపాజిట్టుసొమ్మున్ను దానికయ్యెడు వడ్డీయున్ను, మాత్రమే పొందగలడు.

(సశేషము జూలై పత్రికలో



## నూతన మంత్రివర్గము — ప్రాథమికోపాధ్యాయులు

### మదరాసు మంత్రులకు, శాసనసభ్యులకు, అభివందనలు

ఆర్యా !

ఎన్నికలు జరిగినవి. అనేకరాజకీయ పార్టీలవారు గెలిచినారు. తుదకు కాంగ్రెసువారే మరల మంత్రి పదవులు స్వీకరించినారు. అన్ని పార్టీలవారు ఎన్నికలలో ఉపాధ్యాయుడు మొదటి దేశ భక్తుడనియు, భావి పౌరులను తయారు చేయువాడనియు, దేశ సౌభాగ్యం ఆయనపైనే ఆధారపడి ఉన్నదనియు, అతని ఆర్థిక జీవితము చాల దుర్భరమనియు, ఈ సారి తప్పక ప్రాథమిక ఉపాధ్యాయుని కడగండ్లు బాపుటకు కృషిచేయుదుమనియు, ఉపన్యాస వేదికలపై నుడివియున్నారు.

ఆనాడు అయితే చెప్పినారు. వారిలో కొందరు ఈనాడు అధికారపార్టీలోను, కొందరు ప్రతిపక్షులుగాను న్నారు. ఈనాడు మనము వారి దృష్టిలోనే యుండమేమో? ఎన్నికలలోనే మన ప్రాథమిక ఉపాధ్యాయులకు పౌర సత్వభంగము కలిగించినారు, కావున ఇప్పటినుండియే మనము, సెంట్రల్ పేకమీషను వారి స్కేళ్ళు అమలుపరచవలయునని, ఉపాధ్యాయులపై వృత్తిపన్ను తొలగించవలయుననీ, సమాన గ్రేడుగల ఉపాధ్యాయులందరు ఏ మేనేజిమెంటులో నైనను సమానముగా ఆదరించ బడవలెననీ, ప్రాథమిక ఉపాధ్యాయులకుకూడా ఉపాధ్యాయ వోటింగ్ హక్కు కలుగజేయవలెననీ, మొదలుగాగల కోర్కెలనుగూర్చి ఆందోళన చేయవలసియున్నది.

శ్రీ రాజాజీలాంటి రాజకీయవేత్త ప్రధానామాత్యులు శ్రీ డాక్టరు యం. వి. కృష్ణారావుగారు విద్యాశాఖకు మంత్రి పుంగవులు. వీరికి ఆకలి డొక్కలతో కృంగి కృశించు ప్రాథమిక ఉపాధ్యాయుల యొక్క ఆర్థికదుస్థితిని ప్రతి శాసనసభాసమావేశములోను తెల్పుటకు శ్రీ సింగరాజు రామకృష్ణయ్య M. L. C గారు తీవ్రముగా కృషిచేయుదురని నా నమ్మిక. వారికి నా ధన్యవాదాలు.

మనము కాళ్ళుముడుచుకొని కూర్చుండరాదు. ఎన్నికల వాగ్దానాలు చెల్లించవలసిన బాధ్యత శాసనసభ్యులపైగలదు. కావున ప్రాథమిక ఉపాధ్యాయులందరు స్థానిక M. L. A లను గట్టిగా ఒత్తిడి చేయవలెను. ఈ విషయములో ప్రతి సెంటరునుండి ఆందోళన లేవదీసి కృషిజేయవలెనని సోదర ప్రాథమికోపాధ్యాయులందరికి మనవి చేయుచున్నాను. ప్రతి సోదరోపాధ్యాయుడు ముందంజవేయునని ఆశించుచున్నాను.

మందలపు వీరరాఘవయ్య,
ఉపాధ్యాయుడు,
పంచాయితీ పాఠశాల,
జలపాటి గూడెం.

## ఉపాధ్యాయులకు టి. ఏలు యివ్వాలి.

ఆర్యా !

బోర్డు ప్రాథమిక పాఠశాలల ప్రధానోపాధ్యాయులందరును ది 30-4-52 లోపుగా బోర్డాఫీసునకు వచ్చి, వారిపాఠశాలలకు జిల్లాబోర్డు సప్లయిచేయు "పాఠశాలోపకరణములను" దీసికొని వెళ్ళవలసిన దనియు నందుకొరకు టి.ఏ.గాని, కంటింజెన్సీగాని, యివ్వబడదని స్పష్టముగా తెలియజేయుచున్నామనియు, కృష్ణా జిల్లాబోర్డు అధ్యక్షులు శ్రీ కాకాని వెంకటరత్నముగారి సంతకముతో ఆర్. ఒ. సి. నెం డి 25720/51 ది 29-4-51 తేదీగల సర్క్యులరు, యిటీవల యీ జిల్లాలోని జిల్లాబోర్డు ప్రాథమిక పాఠశాలలకు వచ్చినది.

ఈ సర్క్యులరును బట్టి జిల్లాలోనిబోర్డు ప్రాథమికపాఠశాల ప్రధానోపాధ్యాయులందరును, తమ స్వంతఖర్చులతో బందరులోని, జిల్లాబోర్డు ఆఫీసునకువెళ్ళి, యీ ఉపకరణములు తెచ్చుకోవాలి. అనగా ప్రతిప్రధానోపాధ్యాయుడు ఈ బాధ్యతను నిర్వహించుటకుగాను అప్పోసప్పోచేసి సుమారు 5, 6 రూపాయలు ఖర్చుపెట్టాలి.

ఈ నాడు యీ వచ్చు స్వల్పజీతములతో కుటుంబ నిర్వహణచేసుకోలేక, అప్పులపాలై పరపతిని పోగొట్టుకొని అనేక ఆర్థికదురవస్థలకు గురియగుచున్న ఉపాధ్యాయులకు యీ యుత్తరువు గోరుచుట్టుపై రోకటిపోటువంటిది. యీ యుత్తరువును జూచి బాధపడువారుతప్ప శ్లాఘించువారు ఒక్కరును ఉపాధ్యాయులలో నుండరని తెలియజేయుచున్నాను.

నెల రూపాయలఖర్చుతో ఉపకరణములను సప్లయిచేయవలెనను నిర్ణయము తీసికొన్న జిల్లాబోర్డు అధ్యక్షులు, యీ యుపకరణముల పంపకపు ఖర్చులను ఉపాధ్యాయులమీద యెందుకు రుద్దవలసి వచ్చినది? ఇదిమిక్కిలి అన్యాయము-కాబట్టి యీ యుత్తరువునుసరించి జిల్లాబోర్డుఆఫీసునకు ఉపకరణముల కొరకు వెళ్ళిన ఉపాధ్యాయులందరికి టి. ఏ. లు మంజూరుచేయుట అధ్యక్షుల కనీసధర్మమని మనవి జేయుచున్నాను.

జిల్లాలోని ఉపాధ్యాయులు, ఉపాధ్యాయసంఘాలు- ఈ టి, ఏ ల మంజూరు కొరకు తగిన ఆందోళన చేయువలసినదిగా విజ్ఞప్తిచేయుచున్నాను.

ఇట్లు వందనములతో

నాదెళ్ళ సీతారామాచారి,

కార్యదర్శి,

కృష్ణాజిల్లా ప్రాథమికోపాధ్యాయ సంఘం.

తేలప్రోలు,

15—5—52

---

పిల్లలకు ప్రత్యేకం

## 8 8 8 పేరుగొప్ప 8 8 8

బాలకవి: పి. వి. సీతారామశాస్త్రి — పాచిపెంట

1 వ జట్టు :
అందం చందం అన్నీ గలిగిన
గడుసుకుఱ్ఱలూ బడా బాబులూ !
యేవూరం డిది యేవూరు ?
యీవూరు పేరు చెప్పండీ !

2 వ జట్టు :
చెప్పం చెప్పం చెప్పం మేం
మా వూరు పేరు చెప్పం మేం!

1 వ జట్టు :
అంతగొప్పదా మీవూరూ !
గర్వం విడచి సగౌరవముగా
మీ వూరు పేరు చెప్పండి !

2 వ జట్టు :
గొప్పవూరు మా వూరండీ ! ఏ

దక్షరాలుగల పేరండీ!
"చదువులపాలెం" అంటారండీ?

1 వ జట్టు :
ఆఁ! అలాగా!
ఓహోహోహో తెలిసిందండీ!
పేరుగొప్పది ఊరుదిబ్బ యను
సామెత జగాన వుందండీ!

2 వ జట్టు :
అలాంటి గ్రామం కాదనుకోండి
డబ్బుగలిగిన షావుకార్లతో
భూములుగలిగిన రైతులతో
రచ్చబండగల పెద్దగ్రామమూ!
వచ్చిచూడు డీ మాగ్రామం
మెచ్చుకొనండీ మీరంతా?

1 వ జట్టు :
సరేసరే! సరేసరే
బాగుందండీ పెద్దగ్రామమే!
భలే బాగుగా వున్నాదండీ!
పాఠశాలను చూపించండీ!
పంతులుగారిని చూస్తామండీ!

2 వ జట్టు : మే - మే - మే - మే

1 వ జట్టు :
మేమేమేమే! మేకపిల్లలా?
పంతులుగారిని చూస్తామండీ
పదండి పదండి మీబడి కెడదాం

2 వ జట్టు :
పాఠశాల మావూరను లేదు
పంతులుగారు అసలే లేరు
పాఠాలే మాకక్కరలేదు
పోటీచేస్తే చెయ్యండీ!
మావిఘ్నేశ్వరు డున్నాడండీ!

విఘ్నేశ్వరుడు : ఛాలెంజీ! ఛాలెంజీ!
యెందరైన నాతో రండీ!

1 వ జట్టు : పోటీచేసిన విఘ్నేశ్వరుడా
సూటిగ జవాబు చెప్పాలి శీఘ్రం
అరుమూడులో మూడారు పోతే
మిగిలే దెంతో చెప్పయ్యా!

విఘ్నేశ్వ :
లెక్కలు డొక్కలు అక్కరలేదు
చదువూసంధ్యల పోటీకాదు
రింగుసతిరిగే బొంగరమాట
గుడుగుడు గుడుగుడు చెడుగుడియాట
పందెంవేసీ పోటీచేస్తే
పసందుమీకే తెలుస్తుందీ!

1 వ జట్టు :
హీహీహీహీ హీహీహీహీ!
పెద్దగ్రామమున బడియే లేదు
విఘ్నేశ్వరుడికి చదువే రాదు
చదువురాని ఓ మొద్దుల్లారా!
విద్యలేని ఓపసువుల్లారా!
భారతదేశం పాలన చేసే
భావిపౌరులు మీరేనా?
పేరుగొప్పలో యేముందండీ!
పంతులుగారిని పిలిపించండీ!
పాఠశాలను నెలకొల్పండీ!
బాగుగ విద్యను నేర్చుకొనండీ!
భారతదేశం పాలించండి!
అరాచకములను అరికట్టండీ!
ఆంధ్రరాష్ట్రమును సాధించండీ!
అయ్యామాకిక సెలవియ్యండీ!
నమస్తే నమస్తే వెడతామండీ!

2 వ జట్టు ;
మందమతులమై చెడిపోయాము
మీసూక్తుల నిక పాటిస్తాము
జై హింద్! జై హింద్ వుంటామండీ!

1 వ జట్టు :
జిందాబాద్! జిందాబాద్!
ఆంధ్రబాలలకు జై హింద్! జై హింద్!

# ప్రాథమికోపాధ్యాయులు - కఱవు

రచన :—గుంటూరు పేరిశాస్త్రి, మోగల్లు.

ఉ॥ చెప్పఁగలేక మేము పడు చేటులు మాదగు డెందమందునే
కప్పితి మింతదాక; మఱి గ్రక్కనగాని శమింపబోదు మా
యిప్పటిబాధ యంచు నొక యించుక దారిని జూపి యిప్పుడే
చెప్పుచు నుంటిమయ్య ఇక జిత్తము మీయది ప్రాప్తి మాదియున్. ౧

ఉ॥ జీతము వచ్చుచేతడవు చేరి వసూళ్ళను జేసికొంచు మా
చేతను నుండనీయ రొక చిల్లిగ నుండెడి నాణెమేనియున్
ఆతరినుండి బెంగటిలి యాకలి నిద్రలు సెంపబోక పై
వేతన మందుదాక పరివేదనతో సహపుస్తు మాసెలన్. ౨

ఉ॥ మాతయు తండ్రియో యొకరొ మానక మావెనువెంట నుంద్రు మా
చేతులఁ గట్టుకొన్న కుల చేడియ దప్పను, దానికల్గి సం
ప్రీతినిగూర్చు మాతనయ బృందము వీడదు మమ్ముజూడనీ
జీతపురాళ్ళతో నెటుల జీవితముల్ గడపంగ నేర్తుమో! 3

ఉ॥ ఇప్పుడు మాకువచ్చు నెల జీతముల్ గణియించి చూచినన్
అప్పులుచేసిగాని గడ పన్ గనజాలము మా కుటుంబముల్
పప్పు పదార్థముల్ దినెడి భాగ్యము నోచుకొనంగ లేము ఈ
అప్పులుదీరి మేము యొకటన్ బహుభాగ్యము లేదొకింతయున్. ౪

ఉ॥ పాపము లేదవారగని భావములో నొకనైన జూడగా
నోపదు; నోటితో నడుగ నోపనివారము మేము; అందుచే
రేపటిచింత మామనసు రేగెడుమాకు మయో లె, రాత్రులన్
దోపగనీక యేమియును దూరముగా నొనరించు నిద్రకున్. ౫

చం॥ అగువులు పుట్టబోవు ఇతరాస్తులు లేవు, ధనమ్ము లేమిచే
దొరకవు వస్తుజాలములు తొంటిఖరీదుకు మాకు నెన్నడున్.
కరము కరమ్ముగా ధనము ఖర్చగు స్వల్పపువాటికైన ఈ
కఱవును దాటగల్గు నవకాశ మదెన్నడు గల్గునో యికన్. ౬

ఉ॥ కోమటి లెక్కకై యెదుటి గుమ్మమునందున వచ్చి నిల్చి నా
భామను పల్కరించి "యిది భావ్యమె? ఆయన" కంచుబల్కి "మీ
కేమి? పరాయిసొమ్ము దిగ మ్రింగగ జూచెదు మీదుజాతి" యం
చేమియొ బల్కగా గనుల వెంబడి నీటిని గ్రుక్కుకొంచు, నా
భామ భరించు దుఃఖమును బాపుదు నే యిక జీవముండగన్. ౭

ఉ॥ "కప్పుకొనంగ లేదు; చలి ‡ కాలము వచ్చెను; నాకు పిల్లకున్
దుప్పటి యొక్కటైన" యని ‡ తోయరుహానన కంటినీటితో
జెప్పిన; బాణమై హృదయ ‡ సీమను నాటగ దాళలేక; ఏ
చప్పుడులేక మేమెటులొ ‡ జారుటతప్ప మరేమి లేదుగా! ౮

తే॥ గీ॥ కట్ట బట్టయు లేక నా ‡ కాంతపడెడు
పాటు గనుగొన బల్లెంపు ‡ పోటునాకు
తినుటకును లేక నేపడు ‡ తీవ్రబాధ
నాదు నిల్లాలి కంటికి ‡ సూదిపోటు. ౯

చం॥ కులసతి చెందుకష్టముల ‡ గొన్నిటినైనను దీర్పలేని నా
తెలివి యదెంతయున్న గడు ‡ తేలికగా గనుపించు నాసతీ
తిలకము కంటినీటివడి ‡ ద్రిప్పగ నెన్నియుగాలు పట్టునో?
ఫలితములేని నా బ్రతుకు భాగ్యపు రేఖ జుగుప్స గొల్పెడిన్. ౧౦

ఉ॥ అప్పును జేసినా మనెడి ‡ యారనిచింత, గృహమ్ములోపలన్
ఉప్పునుగూడ లేదనెడి ‡ ఓర్వగలేని మరొక్కచింత; ఏ
అప్పును బుట్టబోదనెడి ‡ యప్పటిచింత కృశింపజేసియుక్
నిప్పునులేక మమ్ము దహి ‡ యించుచు నున్నవి, ఏమిచెప్పుదుక్. ౧౧

ఉ॥ చెప్పుకొనంగజాల మిక ‡ చీటికి మాటికి వచ్చుచుండు నీ
యప్పులవాండ్రబాధ నెటు ‡ లాపగలార మటంచు జూతుమా
"చెప్పడు పార" మంచుమము ‡ చేరెడి శిష్యుల భావివృద్ధికై
ఒప్పగుమార్గమున్ వెదకు ‡ యోచనకై మదిలోన నెంతుమా? ౧౨

ఉ॥ ఇప్పుడు మీరు మాకు సుఖ ‡ యించెడి బాటను జూపకున్న మే
మిప్పగిదిన్ దినంబులను ‡ ఎట్టులొ కష్టముతోడ బుచ్చగా
దప్పదు: బాలకావలియు ‡ దప్పనుద్రోవల బట్టుచుండు నే
చెప్పుట గాదుగాని వికసింపవు ‡ బాలుర జ్ఞానసంపదల్. ౧౩

చం ఇది యొకకావ్య మాను రచి ‡ యింపగ బూనిన; జెప్పనేల, నా
హృదయము నెల్లవేళల ద ‡ హించెడి నీపెను క్షామవహ్నినో
బుధవరులార మీరు పరి ‡ పూర్ణకృపన్ వరిషింప కున్నచో
అధికతమంబుగా బెరిగి ‡ అంతమునందు విషాద మిచ్చెడిన్. ౧౪

ఉ॥ చెప్పిన తాలనేని విక ‡ సింపగజేసెడి నవ్యపద్ధతిన్
జెప్ప సమర్థులైన గురు ‡ శేఖరు లెందరు క్షామనాటికిన్
అప్పనమాయెరో? అది త ‡ లంచిన గన్నుల నీరు గ్రమ్మ నీ
ముప్పు దరింప జీతముల ‡ బూనికతో నిక బెంపు సేయుడీ. ౧౫

---

# బేసిక్ విద్య - దాని ప్రయోజనము

( సర్వహక్కులు రచయితవి ).

రచన:— **కాకరపర్తి కామేశ్వరశాస్త్రి ;** బేసిక్ టీచర్ - ఖండవిల్లి.

వెనుకటివ్యాసమున బేసిక్ విద్యపై వివిధ రాజకీయపార్టీలకు గల యభిప్రాయములను గూర్చి చర్చించియున్నాము. ఇక బేసిక్ విద్యలోని కార్యకలాపములేమి ? వాటివలన విద్యార్థులు భావిజీవితములో సత్పౌరు లెట్లు కాగలుగుదురు ? మొదలుగాగల విషయములను గూర్చి విపులముగా మనవి చేయుదును.

బేసిక్ విద్యావిధానములో జరుగు కార్యకలాపములను మన యుపాధ్యాయ సోదరులు చాలమంది స్వయముగా చూచియేయుందురు. బేసిక్ పాఠశాలలోని విద్యార్థులు ప్రతిపని యితరుల సహాయము లేకయే స్వయముగా చేసికొందురు. వీనిలో ప్రప్రథమమున పరిశీలించ వలసినది పారిశుధ్యము దీనికీ విధానమునందు విశేష ప్రాముఖ్యము గలదు. అది యునుగాక చాలమందికి దీనినిగూర్చి దురభిప్రాయము గలదు. ఒక B. A. B. Ed. వుపాధ్యాయుడు ఒకసారి నన్ను "ఏమండీ ! బేసిక్ ట్రయినింగులో అందలి విద్యార్థుల మలమూత్రములు వారే స్వయముగ తీసికొనిపోయి ఒకచోట వేయవలయునట కదా !" అని అడిగియున్నారు ? విద్యాధికుడైన వుపాధ్యాయుడు ఆ విషయమును గూర్చి అట్టి అభిప్రాయమును కలిగియుండుట యెంత విచారకరమైన విషయమో యోచింపుడు !

నిజానికి, బేసిక్ విద్యావిధానములో మలమూత్రములను వ్యర్థముగ పోనియకుండాను, అనారోగ్యము కలుగకుండాను వానినొక సన్నని "గాడిపాయ్యి" మాదిరి గోతిలో విసర్జించి అందే యెప్పటికప్పుడు మట్టితో కప్పుచున్నచో సుమారు మూడు మాసములకది మంటలో కలిసిపోయి, దుర్వాసనను గోలుపోయి, చక్కని యెరువుగా మారును. అట్టి యెరువువలన యకరము భూమిలో 2000 రూ॥ల ఆదాయము రాబట్టుట చేనెరుగుదును. ఐనను అట్టి పద్ధతిని పై విధముగా ఒక విద్యాధికుడు అపార్థము చేసుకొన్నాడు కదా ! అట్టివారి సంఖ్యయే నేడు మిక్కుటముగా నున్నది.

తదుపరి విషయము, సమిష్టిభోజనము మనము కోరుచున్న కుల, మత, వర్గరహిత ప్రజాస్వామ్యము త్వరగా లభించుటకు యింతకంటె సులువుమార్గము లేదని నా యభిప్రాయము. చాలమంది నాయకులు మాటలు చెప్పుట తప్ప తనకూతురును యితరకులముకు, వానికిచ్చి పెండ్లిచేయడు. తనకొడుకునకు విశేష కట్నములేనిదే, తనకులము కానిదే, చేసుకొనడు. ఒకవేళ తక్కువకులమువారిని వివాహమాడినామని చెప్పుకొనేవారు కొందరున్నను, అట్టివారు డబ్బు, చదువు, సంస్కారము, అందముగలవారినే చేసుకొందురుగాని పీడితప్రజలనుతమదరిచేర్చుకొందురా ? వారియిండ్లకైనను పోవుదురా ? కావున అస్పృశ్యత నశించి సమాజము పురోగమించుటకీ పద్ధతి సర్వోత్తమమని యెల్లరు అంగీకరించవలసినదే. అట్టి వర్గ వ్యత్యాసమును విద్యార్థులకు చిన్నతనము నుండియు నాశనము చేయుటవలన దేశము త్వరగా పురోగమించును గదా !

అన్నిటికంటె ముఖ్యమైనది ప్రజాస్వామ్య సూత్రములపై పాఠశాల పరిపాలన జరుపుట మనదేశము ప్రజాస్వామ్య సూత్రములపై పరిపాలింపబడుచున్న యీరోజులలో దీని యావశ్యకతను గూర్చిచెప్ప నక్కరలేదు.

పాఠశాలలోని విద్యార్థులే తమనాయకుని, యితరపనులను నిర్వహించుటకుమంత్రులను యెన్నుకొని వారిద్వారా సక్రమముగా పాఠశాల, భోజన సదుపాయములు, మొదలుగా గల ఎల్లపనులు నిర్వహింతురు. వీరు (ఈమంత్రులు) వేలకొలది రూపాయలను తమద్వారా ఖర్చుపెట్టుదురు. అట్టితరి వారికెంతటి యనుభవము గలుగునో యూహింపుడు.

నిజముగా విద్యార్థులకు చిన్నప్పటినుండి యిట్టి శిక్షణయున్నచో యిప్పటివలె నిరక్షరకుక్షులు, శాసనసభలకు ప్రజాప్రతినిధుల సభలకు యెన్నుకొనబడుదురా ? మంత్రులు మొదలగువారు యింత పక్షపాతముగా, అవినీతిగా, ప్రవర్తించియుందురా ?

శాసనసభ్యులు యీ విధముగా నిమిషమున కొక పార్టీ ఫిరాయించెడివారా ?

కావున పాఠశాల ప్రజాస్వామ్య సూత్రములపై నిర్వహింపబడుట - ప్రతిదినము విద్యార్థులు వార్తా పత్రికా పఠనముచేయుట, మొదలగు పనుల వల్ల భావికాలములో చక్కని రాజకీయజ్ఞానము కలవారగుదురు. ఈ విధానములోని ముఖ్యకార్య క్రమములనుగూర్చి చర్చించితిమి ఇక దానివలన కలుగు సామాన్య ప్రయోజనములను గూర్చి మనవిచేయుదును.

## ఈ విద్యావిధానమువలన విద్యార్థులు భావి జీవితములో సత్పౌరు లెట్లు కాగలుగుదురు ?

ఈ విధానమునందు మామూలు విద్యావిధానము నందువలె కేవలము వుపాధ్యాయుడు చెప్పినది వినుట మాత్రమే గాక, ప్రత్యక్షముగా తాముచేసి చూచు అవకాశము విద్యార్థుల కుండుటచే వారికి పరిశీలన జ్ఞానము కార్యకారణ సంబంధ జ్ఞానము, కలుగును.

విద్యార్థులు సర్వదా కలసిమెలసియుండి వారి కాలమును యెక్కువగా సాంఘికసేవా కార్యక్రమములయందు (గ్రామసేవ మొదలగు కార్యక్రమములందును, వినియోగించుటచే విద్యార్థులకు చిన్నప్పటినుండి సేవాదృష్టి యలవడిన, భావి జీవితములో సర్వమానవ సౌభ్రాతృత్వముగలిగి, సమాజ సేవచేయగలుగుదురు.

మన ప్రజాస్వామిక రాజ్యాంగము, దాని ఆశయములు. దాని వుత్కృష్టత, నడవడుపు విధానము, స్వయముగా తెలుసుకొనుటకు అవకాశములు కలుగుటచే విద్యార్థులకు, తగిన నాయకుల నెన్నుకొనుట, వారి యాదేశానుసారము నడుచుకొనుట, చట్టములకు లోబడి వర్తించుట, మొదలుగా గల విషయములు, నాయకత్వము వహించి ప్రజలను నడుపుట, పరిపాలితుల ఆదరాభిమానములు చూరగొనుట, మొదలగు విషయములు నేర్చుకొని భావిజీవితములో యిప్పటి పరిపాలకుల వలెగాక సక్రమముగా వర్తింతురు.

అంతేగాక విద్యార్థులు పాఠశాలలో మంత్రి పదవులను నిర్వహించి, ఆకాలములో తాము చేసిన పనిని గూర్చిన నివేదికను సభికుల యెదుట పెట్టి, దాని నామోదింప జేసుకొనవలయును దానివల్ల విద్యార్థికి రచనాశక్తి, వుపన్యాసశక్తి, సభికుల ఆదరమును చూరగొను శక్తి, యలవడును

ప్రస్తుతవిద్యార్థులవలె చదువుకొంటిమి గనుక కాయకష్టము చేయుట అగౌరవము అని భావించక కష్టించి పనిచేయుట చిన్నతనమునుండి అలవడిన వాడు గావున స్వతంత్రముగా జీవింపగలుగును

నియమబద్ధమైన ఆహారవిహారాదులు, పారిశుధ్యం ఆరోగ్యసూత్రములు, పాటించుచు, జీవితమును గడుపుటచే చక్కని శరీరపుష్టిగలిగి మంచిఅలవాట్లు గలిగి, విద్యార్థి దీర్ఘాయుష్మంతుడగును

ప్రతివిద్యార్థియు తన జీవిత నిర్వహణమునకవసరమగు అన్నిపనులయందు ప్రావీణ్యము సంపాదించుటయేగాక ఏదోయొక ప్రధానవృత్తిలో నిపుణుడగును గాన నిరుద్యోగసమస్య సులభముగా పరిష్కరింపబడును అదియునుగాక నేటివిద్యార్థి వలె వుద్యోగము దొరకనేగాని జీవించలేనివాడుగా తయారుకాడు

దేశాభిమానము, స్వదేశవస్త్వాభిమానము న్యాయవర్తనము, గాగల సద్గుణము లలవడును.

జీవితములో పొదుపరితనము, ఆదాయమునకు తగిన వ్యయముచేయుట, మొదలుగాగల సద్గుణములు కలుగును.

వేయేల ? స్వతంత్రభారత దేశములో ఆదర్శప్రాయుడైన వ్యక్తియై దీనివల్ల సాధ్యముకాని సాంఘిక, రాజకీయ, నైతిక మార్పులను సాధించగలుగును.

## ప్రయోగములు-పరిశోధనలు

ఈ విద్యావిధానము బ్రిటిషువారు మనదేశమును పరిపాలించు సమయముననే యేర్పాటుచేసినను వారలు యీవిధానమునకు విముఖులగనే యుండిరి ఏలయన తమ నిరంకుశత్వమును రూపుమాపయత్నించుచున్నట్టియు, యావద్భారత నాయకుడైనట్టియు, గాంధిజీదీనిని కనిపెట్టియున్నారు. అదియునుగాక యీవిద్యావిధానము దేశములో విస్తరింపబడుచో ప్రజానీకము చైతన్యవంతమై తమ బానిసత్వము నుండి విముక్తి మార్గమున్వేషించును. అంతేకాక ప్రతివారు విద్యావంతులై సత్పౌరులౌదురు. వ్యవసాయము, కుటీరపరిశ్రమలు, వృద్ధియై దేశము ధనధాన్యసమృద్ధమగును. అట్టిచో తమకీ దేశమున స్థానమేది ? కావున వారెదియో నెపమున యీ విద్యావిధానమును రూపుమాప యత్నించిరి అందుకొఱకై యీ విధానమును ద్వేషించుచుట్టియు,

# ఆవేదన

రచన : యడవల్లి కృష్ణమూర్తి

***

నిరక్షరాస్యుల నిర్మలహృదయం
శాస్త్రజ్ఞుల స్వార్థపరత్వం
ధనవంతుల దౌర్జన్యాలు
దేశచరిత్రల కాధారాలా ? 1

శాస్త్రముపేరిట సంఘముపేరిట
ఆటంబాంబులు అనాగసేవ
మానవజీవితి మాంగల్యానికి
కొలతచెప్పెడి కొలతబద్దలా ? 2

పంచనదుల పంజాబు
విజ్ఞానపు విద్యల నగరం
మతోన్మాదుల మాత్సర్యానికి
కృతఘ్నులకుటిలత్వానికఆహుతికాలేద ? 3

ఆకటియాత్రల ఆత్మహత్యల
కడుపుమంటచే కనలేవాళ్ళు
మృత్యుదేవతకు ముద్దుబిడ్డలు
భారతదేశపు భావిపౌరులా ? 4

స్వర్గము సౌఖ్యము రామరాజ్యమూ
మానవజీవితపు కరడు
కట్టిన కలలసమూహాం 5

సంఘానికి వెలిచినజీవులు
సుఖాన్ని మరచినదీనులు
పాషాణపు పిడికిటిలో
కన్నానోయి! నే కన్నానోయి! 6

నవఖాళీ కత్తులగాథలు
హీరోషిమా నాగసాకి మారణహోమం
కాశ్మీరఘకన్యల కంటిధారలు
కన్నానోయి! నే కన్నానోయి!

---

౨౬ వ పేజీ తరువాయి

పాశ్చాత్య విద్యావిధానమే మనకు శరణ్యమని నమ్మినట్టియు, సభ్యులతో ఒక కమిటీనేర్పరచి వార్ధాలో నడుపబడుచున్న బేసిక్ ప్రాథమికపాఠశాలలను పరిశీలించుటకై పంపిరి.

ఆ కమిటీవారు వార్ధాలో ఆదర్శప్రాయముగ నడుపబడుచు, స్వయంసంపూర్ణములై, ఆశ్చర్యకరమైన అభివృద్ధిని కనపరచిన ఆబేసిక్ పాఠశాలలను దర్శించి, తమ మొదటి యభిప్రాయమును మార్చుకొని, మామూలు పాఠశాలలోని విద్యార్థులకంటె వీరు విద్యావిషయికముగా గూడ చాలా ముందంజ వేయుచున్నారనీ, ఈ విధానము హిందూదేశమున కెంతయోతగియున్నదని, పాఠశాల నిర్వహణమునకు వలయు విధానము పూర్తిగా పాఠశాల విద్యార్థులే సంపాదించుచుండిరనియూ, ఈవిధానము దేశమంతట అమలుపఱచ దగియున్నదనియూ, తెలిపిరి.

ఈ విధానమునకు వ్యతిరేకులైన వారిచేతనే యింత ప్రశంసింపబడిన యీవిద్యావిధానముయొక్క ప్రాశస్త్యమును గూర్చి వివరించుట అతిశయోక్తియే కాగలదు.

వేయేల! మనము తరతరాలుగా మన ధన ప్రాణములను బలిపెట్టి, శ్రమించి, ఆర్జించుకొన్న రాజకీయ స్వాతంత్ర్యము సుస్థిరము కావలయునన్న, మరియు ఆర్థిక, సాంఘిక, స్వాతంత్ర్యములు సాధించవలయునన్న, భావిభారతపౌరులు దేశసేవకులు కావలయునన్న, కుల, మత, వర్గ, రహితమైన సమాజ మేర్పడవలయునన్న, దేశములో దౌర్జన్యము పరస్పర సంఘర్షణములు, నశించి, సత్యము, ధర్మము, అహింస, నెలకొనవలయునన్న-యీవిద్యావిధానము నమలుపరచి సక్రమముగా నిర్వహించవలయును "యావత్ప్రపంచ జ్ఞానదాత" పూజ్య బాపూజీ సెలవిచ్చియున్నారు. కావున వివిధవర్గములలోని వ్యక్తులు తమగురభిప్రాయములను వదలి, యీవిద్యావిధానమును ప్రోత్సహించిననే కాని మన జవహరు పండితు డాశించినట్లు మనదేశము స్వయంసమృద్ధము శక్తివంతము కాజాలదు

రాబోవు వ్యాసమునందు బేసిక్ ఉపాధ్యాయుని బాధ్యతలను గూర్చియు, ఆతని వ్యక్తిత్వమును గూర్చియు, చర్చింతము.

# పదపూరణము

రెండేసి అక్షములను చేర్చి ప్రక్కన సూచింపబడిన అర్థములకు సరిపోవునట్లు ఈ క్రిందిపదములను పూరింపుడు.

విద్యార్థులుమాత్రమే వీనిని పూరించి పంపవలెను.

రెండు తప్పులకు మించకుండ చక్కగా పూరించి పంపినవారిపేర్లు వచ్చేనెల సంచికలో ప్రకటింపబడును. అయితే అట్టి విద్యార్థులు మా పత్రికకు చందాదారులై యుండవలెను. లేదా రెండు అణాల తపాలాబిళ్ళలు విధిగా పంపవలెను. లేనన్నవారి పేర్లు ప్రకటింపబడవు.

సరియైన సమాధానములు వచ్చేనెలసంచికలో ప్రకటింపబడును.

| పదములు | అర్థములు | పదములు | అర్థములు |
|---|---|---|---|
| 1. స – – ము | ఎల్లప్పుడు | 6. స – – ము | గుంపు |
| 2. స – – ము | ఓర్పు | 7. స – – ము | ఇల్లు |
| 3. స – – ము | దగ్గఱ | 8. స – – ము | తోడ్పాటు |
| 4. స – – ము | వేళ | 9. స – – ము | యజ్ఞము |
| 5. స – – ము | సంఘము | 10. స – – ము | గాలి |

కూర్పరి : ఆర్. సుబ్రహ్మణ్యం,
టీచరు, గంగలకుర్తి అగ్రహారం.

# వివేక ప్రశ్నలు

అరయ నాల్గక్షరము లొక్క 'తరువు' పేరు;
అదియ 'ఖడ్గంబు'నకుఁ జెల్లు; మొదలుతుదలు
చెఱుపనగు 'మాల'; రెండవక్కరము చెఱుప
'తలము'నకు నొప్పు; చెప్పు డాతరువుపేరు.

శ్రీ భోగాపురపు సీతారామస్వామి,
హెడ్మాష్టరు - కొట్టికి.

వంగతోటనుండు – వరిమళ్ళలో నుండు ;
జొన్నచేలనుండు – చోద్యముగను ;
తలుపుమూలనుండు – తలమీదనుండును ;
సరి జవాబు లిందె యరసి చెప్పుడు.

శ్రీ ఎ. వి. గోవిందరాజు,
హెడ్మాష్టరు - తోపుదుర్తి.

# మే నెల చిత్రప్రశ్నలు

(1952 సం॥ మే నెల సంచికలో ప్రకటించబడిన)

**వివేక ప్రశ్నలు**

అను చిత్ర ప్రశ్నలకు జవాబులు

**౧. వేదండము. ౨. శతారము**

* * *

రెండు ప్రశ్నలకు సరియైన జవాబులు పంపినవారు

చందా నెం

**845** బి. నరసయ్యగారు – కార్యదర్శి – కేంద్రోపాధ్యాయ సంఘం. రైల్వేకోడూరు

566 బగ్గాం సింహాచలంగారు - టీచరు మేనేజరు - పాతబగ్గాం
270 భోగాపురపు సీతారామస్వామిగారు - హెడ్‌మాస్టరు - కొట్టిశ
111 ఆర్. వేంకటరావు పట్నాయక్‌గారు - టీచరు - వండువ.
695 కలిదిండి సత్యనారాయణరాజుగారు - టీచరు - మొయిద
571 భానూరు సత్యనారాయణ పట్నాయక్ - హెడ్మాస్టరు - అవలంగి
46 తేగడి సత్యనారాయణగారు - మేనేజరు - కోటిపాం
609 ఆర్. దివాకరరాజుగారు - టీచరు మేనేజరు - తగాటిపల్లి
804 కాశిన ఆదినారాయణరావు - విద్యార్థి - గరులియా పశ్చిమ బెంగాల్.
338 టి. పంపయ్య - హెడ్మాస్టరు - చామల గూడూరు
దుంపరామమూర్తిగారు - టీచరు - చింతపల్లి పేట
337 అమరపు సత్యనారాయణగారు - టీచరు - పాములవలస
ఎ. వి. గోవిందరాజుగారు - హెడ్మాస్టరు - తోపుదుర్తి
336 బి. సి. వి. సుబ్బరాజుగారు - హెడ్మాస్టరు - ఇంజేడు
525 కె. రామన్నగారు - రిటైర్డు టీచరు - కోడుమూరు
96 ఆర్. సుబ్రహ్మణ్యంగారు - టీచరు - గంగలకుర్తి అగ్రహారం
కె. చల్లయ్యారత్నం
అరసాడ శ్రీరాములు టీచరు మేనేజరు పాముకవలస

మొదటి ప్రశ్నకు మాత్రమే

314 చింతాడ రాములుగారు - టీచరు - రామదాసుపేట
మైలపల్లి నారాయణస్వామి Ship merchants, పెదమేడపల్లి
128 బి. ధర్మారావు పట్నాయక్ Teacher manager, జమ్మిడివలస
716 త్యాడరాజు గోపాలరావు పట్నాయక్ మేనేజరు పనసపెద్ది కోనవలస

---

# పదపూరణము

## సమాధానములు

1. కమలము
2. కలుషము
3. కరణము
4. కలహము
5. కనకము
6. కపోతము
7. కలశము
8. కపటము
9. కమఠము
10. కఠినము

అన్నిపదములు తప్పులు లేకుండ పూరించి పంపిన విద్యార్థులు

యన్ జాన్ సైరిల్ బాబ్ - యస్. యస్. యల్. సి - వీరవాసరం
804 కాసిన ఆదినారాయణరావు - గరులియా - పశ్చిమ బెంగాల్
చల్లరామమూర్తి - విద్యార్థి - ఎలిమెంటరీస్కూలు - పప్పులలింగాలవలస
122 డర్రు అప్పలస్వామి - 3 వ ఫారము - బాడంగి
దుంప అమృతకుమారి - విద్యార్థిని - అడపాపేట
దుంప ప్రకాశరావు - 5 వ తరగతి విద్యార్థి - అడపాపేట




## :: గురుమూర్తి ::

కొన్ని దశాబ్దుల క్రిందట - ఒకానొక రోజున-అమెరికా దేశంలోని న్యూయార్కు-పట్టణంలో చాలహడావిడిగా ఉండెను. నల్లని తారుతో నునుపుచేయబడిన ప్రధాన రాజవీధి. చక్కగా తుడువబడి, నీలపు కాంతుల గ్రక్కుచుండెను. పోలీసు బందోబస్తు ఎక్కువగా ఉండెను. ఆమార్గమున ఒక ప్రాణికూడా నడచుటకు వీలులేదు. బాటకిరుప్రక్కల-అల్లంతదూరాన-ప్రజలు బారులుదీఱినిలబడియుండిరి. వీధిపొడుగునా పదిగజాలకొకరు చొప్పున పోలీసులు ఇరువైపుల నిలబడి కాపలా కాయుచుండిరి. ఇదంతా దేనికో తెలుసా ?

ఆనగరానికి క్రొత్తగా నియమింపబడిన గవర్నరు ఆనాడు-ఆమార్గాన - ప్రభుత్వ భవనానికి వెళ్ళి అధికారస్వీకారం చేస్తాడు. అందుకని ఆ వీధి పొడుగునా రాకపోకలన్నీ బందుచేయబడి, పోలీసుబందోబస్తు చేయబడింది. రక్షకభటాధికారి మాత్రం అటూ ఇటూ పచార్లుచేస్తూ, పోలీసులను హెచ్చరిస్తుండెను. అంతలో నాల్గుగుఱ్ఱాలబగ్గీమీద గవర్నరుగారు బయలుదేరి వస్తున్నట్లు వార్త తెలియవచ్చెను. వెంటనే పోలీసులందఱు ఎవరిస్థానములో వారు సజీవస్తంభాలవలె కాలుగదల్చక, భుజాన తుపాకులు పెట్టుకొని, ఊపిరిబిగించి సాఫీగా నిలబడియుండిరి. వీధి కిరువంకల బారులు దీఱి నిలచియున్న ప్రజలందఱు-ఒకరినొకరు త్రోసికొనుచు-గవర్నరురాకకై నిరీక్షించుచుండిరి.

అప్పుడొక విచిత్ర సంఘటన జరిగెను. పోలీసులు ఇంతగా కాపలా కాయుచున్నను ఎట్లో సందుచేసుకొని, ఒకముదివగ్గు-తోలు గప్పిన యెముకలగూటితో - ఆపాదమస్తకము వణకుచున్న మేనితో - చింపిరి గుడ్డలతో - అడపలుగట్టిన జుట్టుతో - మూర్తీభవించిన దరిద్రదేవతవలె-తనవలెనే ఒక చిక్కి నడవలేక నడవలేక నడచుచున్న ఒక ముసలి కంచరగాడిదనెక్కి, ఒకయిరుకు సందులోనుండి, ప్రజలు వారించుచున్నను వినక, తటాలున రోడ్డుమీదికి వచ్చెను. చూచుటకే అసహ్యము గొలుపుచున్న ఆ వృద్ధుని - అతని వాహనమును-చూచి, ప్రజలందఱు గొల్లున నవ్విరి. రక్షకభటాధికారి నిప్పులు గ్రక్కుచు ఒక్కదుముకులో ఆముదివగును సమీపించి, "మూర్ఖుడా! బుద్ధిలేదు నీకు? ఈ వికృతవేషంతో ఏమని వచ్చావు రోడ్డుమీదికి? పో ముందు అవతలికి పో. ఒక్కక్షణమైనా నిలబడితివా ఈ తుపాకితో కాల్చివేస్తాను. ఊ! కదలు" అంటూ తుపాకి బారుచేసి గద్దించి పలికెను. అతని కాయువు మూడినదని ప్రజలు తహతహ పడుచుండిరి.

అప్పుడా వృద్ధు లేశమును బెదరక,

ప్రశాంత భావముతో జూసి చిరునవ్వులు క్రుమ్మరిస్తూ, "అవును నాయనా! మహారణ్యలోకానికి బుద్ధిగఱపి, జ్ఞానభిక్ష పెట్టునాకు బుద్ధిమెక్కడిది? కాల్చు నాయనా! కాల్చు. నావంటి వృద్ధులమీదికి, నిరుపేదలమీదికి, మీ తుపాకులు పరుగులెత్తుతుంటవి. ఊ! కాల్చు. ఈ నీచపు బ్రదుకు బ్రదకే కంటే చచ్చుటే మేలు. నాపట్ల కృతఘ్నులైన వారిసంఖ్య నీతో మఱొక్కటి హెచ్చుతుంది. నీ ధర్మాన్ని నీవు నిర్వర్తించు. నే నిచ్చటనుండి కదలను" అని జవాబు చెప్పెను.

అతని మాటలకు రక్షకభటాధికారి నివ్వెఱపోయి, యేమిచేయుటకు తోచక, కాల్చుటకు చేతులురాక, కొంచెము కోపము తగ్గించుకొని, ఆ వృద్ధునితో ఇట్లనెను.

ర. అధి—వృద్ధుడా! మొండిపట్టు పట్టవద్దు. అవతల గవర్నరుగారు వస్తున్నారు. మాకు మాట వస్తుంది. నీవు ముందు వెళ్ళిపో.

వృద్ధు—ఎవరా గవర్నరు? ఆయన ఈపట్టణానికి గవర్నరు అయితే నేను ఈసమస్త ప్రపంచానికి గవర్నరును సుమా? నాకు మీరేకాదు ఆగవర్నరుకూడా జోహారు చెయ్యాలి.

ర. అధి— నీ పిచ్చిమాటలు కట్టిపెట్టి ముందు అవతలికి పో.

వృద్ధు— నావి పిచ్చిమాటలు కావు నాయనా! అధికారం వల్ల మీరంతా పిచ్చివాళ్ళయినారు గనుక నన్ను తెలిసికోలేకుండ ఉన్నారు. నీవేమన్నా సరే–నీ కెంతకోపం వచ్చినా సరే- నేను మాత్రం ఇచ్చటనుండి కదలను, ఆ గవర్నరే గొప్ప, నేనే గొప్ప, యిప్పుడే తేలుస్తాను. ఓపికపట్టి చూస్తూండు.

ఆ వృద్ధుని వింతధోరణికి రక్షకభటాధికారి సహింపలేక, అతడు నిజముగా పిచ్చివాడని భావించి, మండిపడుచు "బుద్ధిలేనివాడా! ముసలివాడవని తాల్మి చూపించడము నీ పిచ్చి ముదిరిపోయింది. పోముందు అవతలికి పో. మఱి నోరెత్తితివా బ్రదుకవు" అంటూ తన కొరడాతో ఆ బక్కచిక్కిన గాడిదను మోది, ముందుకు నెట్టెను. ఆ కొట్టుటలో ముసలివానికి గూడ కొరడా దెబ్బ గట్టిగా తగిలెను. గాడిదకూడ ఆ ప్రోపును తట్టుకోలేక ముందుకు బోర్లపడెను. పాపము! ఆ ముదివగ్గు స్పృహ తప్పి నేలమీద పడిపోయెను. ఇదంతా కన్నులార తిలకిస్తున్న జనసమూహము పోలీసులను లక్ష్యపెట్టక ముందుకు నెట్టుకొని వచ్చెను. కోలాహలంతయు ప్రజలతో క్రిక్కిరిసిపోయెను. వృద్ధుని గతి యేమగునోయని అందరు ఆందోళన పడుచుండిరి. రక్షకభటాధికారి కాలుగాలిన పిల్లివలె తన సిబ్బందితో అటూ ఇటూ పరుగులు పెట్టుచు, ప్రజలను చెదరగొట్టుచుండెను.

అంతలో గవర్నరుగారి నాలుగుగుఱ్ఱాల సారటు అచ్చటికి వచ్చి ఆగెను. వెంటనే గవర్నరు బగ్గీనుండి దిగి, చరచర గుంపులోనికి చొరబడెను. ప్రజలు ఆయనకు త్రోవయిచ్చిరి. ఆయన సరాసరి వృద్ధుని సమీపించి, అతనిని తన ఒడిలో చేర్చుకొని, సేదదేరుస్తూ రక్షకభటాధికారివల్ల జరిగినదంతయు తెలిసికొనెను.

కొంతసేపటికి ముదివగ్గు సేదదేరి, కన్నులు విచ్చి, గవర్నరును చూచి, లేచి కూర్చుండి, వణకుచున్న గొంతుకతో

"నాయనా! చిన్ననాడు నీ కష్టరాలు దిద్దబెట్టి, మంచిబుద్ధిగఱపి, నీజ్ఞాననేత్రం వికసింపజేసి, నిన్నింత గొప్పవానిగా చేసిన నీ గురుమూర్తికి ఇదేనా ప్రతిఫలం? తినుటకు తిండిలేక, కట్టుటకు బట్టలేక, ఉండుటకు ఇల్లులేక, ముసలితనములో పోషించువారులేక, నీగురుమూర్తి అలమటించి పోవలసినదేనా? ఈ సమస్త విశ్వానికి జ్ఞానభిక్ష పెట్టిన యీగురుమూర్తికి అన్నమే కఱవయ్యెనా? ఆదరణమే శూన్యమయ్యెనా? అభిమానమే చచ్చిపోయెనా? ఈ గవర్నర్లు, ఈ మంత్రులు, ఈఅధికార్లు వీరంతా ఈ గురుమూర్తి కృపాభిక్షవల్ల పైకి వచ్చినవారేనే? అధికారం వచ్చినంత మాత్రాన గురుమూర్తిని మఱచిపోదురా? ఆయనకు ద్రోహంచేతురా? ఆయనకు కడుపునిండ తిండిపెట్టుటకుగూడ కష్టమందురా? ఎంత అన్యాయం? ఎంత ఘోరం? ఎన్ని జన్మాలెత్తియైన నా ఋణాన్ని వీరు తీర్చుకోగలరా? పవిత్ర గురుమూర్తిని చిన్నచూపుతో, చులకనభావంతో, చూస్తే యేదేశమైన పైకి రాగలదా? ఏజాతియైనా అభ్యుదయపంథాలో పురోగమింప గలదా? నాయనా! దేశ నాగరికతకు, పురోభివృద్ధికి, సౌభాగ్యసంపదకు, మూలకందమైన గురుమూర్తి నిరాదరణ నిరాశానిస్పృహాలతో కుమిలి కమిలి పోతే విశ్వానికి ప్రళయం తప్పదు. చెప్ప నాయనా! చెప్పు. ఈ బహిరంగసత్యాన్ని లోకానికి చాటిచెప్పు. నీవు ఈ నగరానికి మాత్రమే గవర్నరువు. ఈ నీగురుమూర్తి సమస్త విశ్వానికి గవర్నరు. ఈ సత్యాన్ని ఒప్పుకో. నీ అధికార మాలిన్యముతో పవిత్ర గురుస్థానమును అపవిత్ర మొనర్పకుము. నీ అధికార తృష్ణతో గురుమూర్తిని తృణీకార భావముతో తిలకింపకుము. ఆ పవిత్రమూర్తి పట్ల సదా కృతజ్ఞుడవుగమ్ము. ఇదియే నాతుది దివ్యబోధ" అని పలుకుచు గవర్నరు చేతులలోవ్రాలి, కన్నుమూసెను.

ఆగురుమూర్తి దివ్యవాణి నాటినుండి నేటివరకు దిక్కుదిక్కుల ప్రతిధ్వనించుచున్నది. కాని ఆలకించు వారు లేరు. ఆలకించినను ఆచరణలో పెట్టువారు లేరు.

మన రాజాజీ మంత్రివర్గము ఈ దివ్యవాణి నాలకించి ఆచరణలో పెట్టగలదనే యాశ అంకురించు చున్నది. అందుకు నాందీప్రస్తావనలుకూడ జరిగినవి. ఎయిడెడ్ స్కూళ్ళ ఉపాధ్యాయుల బిడ్డలకు కూడ ఉచిత విద్యా సౌకర్యాలు గలిగించుట ఒక శుభచిహ్నము. అదేప్రకారము సెంట్రల్ పేకమీషన్ వారి సూచనలను అమలు పఱచి, ఉపాధ్యాయలోకములో ప్రబలియున్న అసంతృప్తిని తొలగింప గలదని విశ్వసించుచున్నాము.

—సంపాదకుడు



# గౌ॥ మద్రాసు విద్యాశాఖమంత్రి గారికి; మద్రాసు

## ఆంధ్రరాష్ట్ర ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలుటీచర్లు, టీచరు - మేనేజర్లు సమర్పించుకొను విజ్ఞప్తి

### మద్రాసు విద్యాశాఖా డైరెక్టరుగారిద్వారా; మద్రాసు

అంశము —ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలు టీచర్లపై విధించబడుచున్న జరిమానాలు ఉపాధ్యాయ వృత్తి గౌరవమునకే కళంకమును తెచ్చుచున్నవి. గాన ఆ జరిమానాల పద్ధతిని వెంటనే రద్దుచేయాలి.

ఆర్యా !

ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూళ్లలోని టీచర్ల గ్రాంటుస్కేళ్లు ఇతర స్కూళ్ళలోని టీచర్ల జీతాల కంటె చాల తక్కువైనను ఆ స్వల్పగ్రాంట్లనైనను ఉపాధ్యాయులకు గుటక దిగకుండ చేస్తున్నవి. ప్రస్తుత రూల్సు. 1948 సంవత్సరమునకు పూర్వము ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూళ్ల స్థితి బాగావుంటే ఆ స్కూళ్ళ టీచింగు గ్రాంటును 50% వరకు పెంచుటకును, అసంతృప్తిగానుంటే 50% వరకు కోతల నిచ్చుటకును, పరీక్షాధికారులకు సంపూర్ణఅధికారము నీయబడియుండెడివి. ఆ పద్ధతి ననుసరించి ఉపాధ్యాయులకు వచ్చుగ్రాంట్లు చాల సందర్భములలో పరీక్షాధికారుల చిత్తవృత్తులను బట్టియో, వారి దయాదాక్షిణ్యములను బట్టియు. మారుచుండెడిది. ఈ పద్ధతిలో చాలలోపము లున్నవనియో, లేక దీనివలన విద్యాలోపములో అవినీతి ప్రబలిపోవుచున్నదనియో, ప్రభుత్వము ఈ రూల్సును కూకటివేళ్లతో సహా పెరకివేసి ఉపాధ్యాయులకు నిర్ణీతమైన గ్రాంటుస్కేళ్ళను, టైముస్కేళ్ళను ఏర్పాటు చేసినారు సంతోషమే.

కాని తమ డ్యూటీలో లోపమున్న ఉపాధ్యాయులకు వారిజీతములో 10% కు మించని జరిమానాలు పరీక్షాధికారులు విధించవచ్చునని G O. 217 D-29-1-48 రూలు 6 (a) లో ఉదహరించబడటంతో ఉపాధ్యాయలోకంలో అసంతృప్తి చెలరేగింది G O No 3648 L. C. G. D/ 13-8-36 ననుసరించి జరిమానా పద్ధతి ఉపాధ్యాయవృత్తి గౌరవమునకు భంగకరమని లోగడ ప్రభుత్వమే నిర్ణయించి యుండగా ఈరోజులలో ప్రజాప్రభుత్వం అట్టి జరిమానాపద్ధతిని తిరిగి ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలు టీచర్లపై ఏల రుద్దుచున్నారో విచారించ గోరుతాము. ఇతర మేనేజిమెంట్లలో పనిచేయు ఉపాధ్యాయులపై అమలు జరుపబడుచున్న క్రమశిక్షణ రూల్సునే ఈ ఎయిడెడ్ టీచర్లపై అమలు జరిపిన చాలదా ? పైగా న్యాయమునకు తోడుగా "గోరుచుట్టుపై రోకటిపోటు" చందముగ ఏ యుపాధ్యాయుని యందు లోపమున్న ఆ యుపాధ్యాయునకే జరిమానాలు విధించవలెనని రూల్సునందుండగా కొందరు పరీక్షాధికారులు కోతలనిచ్చు పాతపద్ధతుల ననుసరించుచు ఆస్కూలులోని టీచర్లందరి సంవత్సరపు గ్రాంటు మొత్తముపై $1\frac{1}{2}\%$ అనో లేక 5% అనోవారి చిత్తమువచ్చినట్లు కోతలనిచ్చుచున్నారు. ఒక టీచరునందలి లోపములకు ఈవిధముగా ఇతర టీచర్లందరుగూడ నష్టపడునట్లు చేయడము ఎంతధర్మవిరుద్ధమో విచారించగోరుతాము.

ఈ సందర్భములో జరుగుచున్న మరొక అన్యాయమునుగూడ తమయెదుట నుంచుచున్నాము. జరిమానాలు విధింపబడినపుడు టీచర్లపై మోపబడిన నేరములేవో, వారికి తెలుపుబడుటలేదు. ఆ నేరములకు టీచర్ల వద్దనుండి సంజాయిషీ తీసికొనుట అసలేలేదు. సంవత్సరాంతమునకైన ఆ టీచరుకు ఎంతజరిమానా విధింపబడినదో, ఏ ఆఫీసునుండి ఎట్టి ఉత్తర్వులుండవు ఇక పైనలుగ్రాంటు బిల్లు చూచుకొని రావలసిన గ్రాంటు మొత్తము రాకున్నచో ఉపాధ్యాయులలో ఏకొందరికో ఏవో జరిమానాలు విధింపబడి ఉండవచ్చునని ఉపాధ్యాయులు ఊహించుకొనవలసియుండును. ఎన్నోహత్యలుచేసిన క్రిమినలుకు శిక్షవిధింపబడినపుడు కూడ వానిపై మోపబడిన నేరములకు వాడు సమాధానము చెప్పుకొనుటకు పూర్తిఅవకాశము లుండగా గౌరవప్రదమైన ఉపాధ్యాయ వృత్తియందు పనిచేయువారికి, వారిపై మోపబడిన నేరములకు,

# రామా అండ్ కో., (H.O.) ఏలూరు

బ్రాంచెస్.—గుంటూరు - రాజమండ్రి - తెనాలి - భీమవరం - విజయనగరం.



ప్రస్తుత ప్రాథమిక విద్యాప్రణాళిక ననుసరించి తయారుచేయబడిన పుస్తకముల, ఇతర పుస్తకముల జాబితా.

ఇంగ్లీషు పాఠ్యగ్రంథములు

## LADDER OF ENGLISH

BY

The Rev. S. Paul B. A., B. T.,

and

Edited by Miss Olga Williamson M. A.

**1951**

| | | |
|---|---|---|
| Book I for VI Std (1950) | Rs. | 1 0 0 |
| Book II for VII Std (1950) | | 1 2 0 |

## జాతీయవాచకములు

ఉభయ భాషాప్రవీణ

వారణాసి రామబ్రహ్మం, యం. ఏ. గారిచే

డాక్టరు వేపా వరాహనరసింహం,

యం. ఏ. పి. హెచ్. డి, గారి

సూచనల ననుసరించి

| | | | |
|---|---|---|---|
| 1 వ తరగతి | 0 4 0 | 5 వ తరగతి | 0 9 0 |
| 2 వ తరగతి | 0 5 0 | 6 వ తరగతి | 0 11 0 |
| 3 వ తరగతి | 0 6 0 | 7 వ తరగతి | 0 12 0 |
| 4 వ తరగతి | 0 8 0 | 8 వ తరగతి | 0 12 0 |

## జయరామావాచకములు

కవిరాజహంస, కవికులాలంకార

వోలేటి పార్వతీశముగారు

ఉపాధ్యాయుల సత్యనారాయణగారు M.A.L.T.

Retired District Educational officer

| | |
|---|---|
| మొదటి తరగతి | 0 4 0 |
| రెండవ తరగతి | 0 5 0 |
| మూడవ తరగతి | 0 6 0 |
| నాలుగవ తరగతి | 0 8 0 |
| ఐదవ తరగతి | 0 9 0 |
| ఆరవ తరగతి | 0 11 0 |
| ఏడవ తరగతి | 0 12 0 |

## గణితబోధిని

[పిల్లలకు గణితము, డిక్టేషను నేర్పుటకు ఉచ్ఛారణలో తప్పులులేకుండచదివించుటకు, గ్రేడువారిగా ప్రచురించబడినవి. వాచక పుస్తకములకు చక్కని అనుబంధములు. [Supplements of Telugu Readers]

| | | | |
|---|---|---|---|
| 1 వ భాగము | 0 3 6 | 3 వ భాగము | 0 4 6 |
| 2 వ భాగము | 0 4 0 | 4 వ భాగము | 0 5 0 |

## భారతదేశీయ చరిత్రలు

డాక్టర్

జి. వి. సీతాపతిరావు, బి.ఏ.,ఎల్.టి. గారిచే

| | | | |
|---|---|---|---|
| 3 వ తరగతి | 0 5 6 | 6 వ తరగతి | 0 11 0 |
| 4 వ తరగతి | 0 6 6 | 7 వ తరగతి | 0 15 0 |
| 5 వ తరగతి | 0 8 0 | 8 వ తరగతి | 0 14 0 |

## భారతదేశము

(చరిత్ర)

సి హెచ్. సత్యనారాయణరావు,

బి ఏ [ఆనర్స్] బి. ఇడి.

బి. శేషాచార్యులు, బి. ఏ., ఎల్. టి. గార్లచే

| | |
|---|---|
| 4 వ తరగతి | 0 6 0 |
| 5 వ తరగతి | 0 8 0 |
| 6 వ తరగతి | 0 12 0 |
| 7 వ తరగతి | 0 14 0 |
| 8 వ తరగతి | 0 12 0 |

## హిందూదేశ చరిత్ర

సి. భీమసేనరావు, బి ఏ., ఎల్. టి.

| | |
|---|---|
| 6 వ తరగతి | 0 11 0 |
| 7 వ తరగతి | 0 13 0 |
| 8 వ తరగతి | 0 12 0 |

# సివిక్సు పాఠములు

మునిమాణిక్యం నరసింహారావు, బి ఏ., ఎల్, టి..

| | |
|---|---|
| 3 వ తరగతి | 0 4 0 |
| 4 వ తరగతి | 0 7 0 |

మునిమాణిక్యం నరసింహారావు, బి ఏ, ఎల్. టి, పి. వెంకటరత్నం. బి యస్ సి డి యఫ్, బి.యిడి,

[రివైజ్డు వై]

కొండేపూడి సుబ్బారావు, బి. ఏ., బి. యిడి,

| | |
|---|---|
| 5 వ తరగతి | 0 9 0 |
| 6 వ తరగతి | 0 10 0 |
| 7 వ తరగతి | 0 12 0 |

మునిమాణిక్యం నరసింహారావు, బి. ఏ, యల్ టి, పి. వెంకటరత్నం, బి యస్ సి డి.యఫ్.,బి యిడి

| | |
|---|---|
| 8 వ తరగతి | 0 11 0 |

# గణితదర్పణములు

కె. వెంకటేశ్వర్లు, B. A., B Ed,

**Deputy Inspector of Schools.**

| | |
|---|---|
| 1, 2 తరగతులకు | 0 8 0 |
| 3 వ తరగతి | 0 10 0 |
| 4 వ తరగతి | 0 14 0 |
| 5 వ తరగతి | 1 0 0 |
| తెనుగులెక్కలు [డి. సుబ్బారాయుడుగారిచే] | 0 5 0 |
| నోటిలెక్కలు [యం. సుబ్బారాయుడుగారిచే] | 0 5 0 |

# నేచర్ స్టడీ వాచకములు

నిడమర్తి సత్యనారాయణమూర్తి, బి. ఏ, బి యిడి., టి నరసింగరావు, బి. ఏ., ఎల్. టి., గార్లచే

| | |
|---|---|
| మూడవ తరగతి | 0 4 0 |
| నాలుగవ తరగతి | 0 6 0 |
| ఐదవ తరగతి | 0 7 0 |

# ప్రాథమిక విజ్ఞానశాస్త్రములు

నిడమర్తి సత్యనారాయణమూర్తి, బి ఏ.బి.ఇడి. గారిచే

| | |
|---|---|
| ఆరవ తరగతి | 0 10 0 |
| ఏడవ తరగతి | 0 12 0 |
| ఎనిమిదవ తరగతి | 0 14 0 |

# ప్రాథమిక విజ్ఞానశాస్త్రము

(నూతన సిలబస్ ప్రకారం వ్రాయబడినవి.)

గి. నరసింహారావు, బి ఏ., గారిచే

**1951**

| | |
|---|---|
| ఆరవ తరగతి | 0 14 0 |
| ఏడవ తరగతి | 1 0 0 |
| ఎనిమిదవ తరగతి | 1 0 0 |

# ప్రాథమిక భూగోళములు

[1941 సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి]

కె వేంకట్రావు. బి. ఏ, బి యిడి, గారిచే

| | | | |
|---|---|---|---|
| 2 వ తరగతి | 0 4 0 | 3 వ తరగతి | 0 5 0 |
| 4 వ తరగతి | 0 9 0 | 5 వ తరగతి | 0 11 0 |

# ఆదర్శ భూగోళశాస్త్రము

ఆర్. ఎస్. రాఘవులు, బి. ఏ, ఎల్. టి, గారిచే

[రివైజ్డు]

| | |
|---|---|
| 6 వ తరగతి | 1 0 0 |
| 7 వ తరగతి | 1 0 0 |
| 8 వ తరగతి | 1 0 0 |

# బాల గాన మాల

సంగీతము-[స్వరములతో] కె.రామకృష్ణశాస్త్రి గారిచే

| | | | |
|---|---|---|---|
| 1 వ తరగతి | 0 3 6 | 2 వ తరగతి | 0 4 0 |
| 3 వ తరగతి | 0 4 0 | 4 వ తరగతి | 0 4 6 |
| 5 వ తరగతి | 0 4 6 | 6 వ తరగతి | 0 5 6 |
| 7 వ తరగతి | 0 5 6 | 8 వ తరగతి | 0 6 6 |
| 4 వ తరగతి [స్వరం లేకుండా] | | | 0 3 6 |

# నిఘంటువులు

అమరకోశము ప్రథమకాండ

| | | |
|---|---|---|
| | మూలం | 0 3 0 |
| | సటీక | 0 10 0 |
| అమరం త్రికాండ సటీకా క్యాలికో | | 4 8 0 |
| ఆంధ్రనామ సంగ్రహము సటీక | | 0 10 0 |
| ఆంధ్ర నిఘంటుత్రయము | | |
| డిటో | అట్టబైండు | 2 0 0 |
| డిటో | క్యాలికో | 2 8 0 |
| శబమంజరి | | 0 8 0 |

# ఉపవాచకములు

| | | | |
|---|---|---|---|
| కృష్ణవేణి | 0 9 0 | రణతిక్కన చరిత్ర | 0 7 0 |
| బృహన్నల విజయము | 0 15 0 | పరశురాముని చరిత్ర | 0 9 0 |
| ముక్తాంబ | 0 12 0 | ఉత్తరరామాయణసారము | 0 9 0 |
| అజ్ఞాతవాసము | 0 7 0 | రాజసూయము | 0 9 0 |
| పురాణ చంద్రిక 1 వ భాగము | 0 8 0 | ప్రతాపరుద్రుడు | 0 9 0 |
| డిటో 2 వ భాగము | 0 10 0 | కురువంశము | 0 9 0 |
| దశావతారములు | 0 10 0 | ఆంధ్రరాజులు | 0 4 6 |
| షట్చక్రవర్తులు | 0 9 0 | ఆంధ్రులు | 0 4 6 |
| చారిత్ర నాటక పంచకము | 0 9 0 | ఉపాఖ్యాన రత్నావళి | 0 4 6 |
| పోటీ పరీక్షా వ్యాసములు | 1 1 0 | భోజ చరిత్ర | 0 5 6 |
| యదువంశము | 0 9 0 | రుద్రమదేవి | 0 7 6 |
| రఘుకుల వీరులు | 0 9 0 | భారత నారీమణులు | 0 7 6 |
| హరివంశము | 0 13 0 | ప్రహ్లాద చరిత్ర | 0 5 0 |
| అనసూయ | 0 5 0 | రామాయణసారము | 0 9 0 |
| నోముల కథలు | 0 5 0 | భారతసారము | 0 12 0 |
| జాతీయ కథావళి | 0 5 0 | భాగవత కథాసారము | 0 13 0 |
| నీతి కథామంజరి | 0 3 0 | కర్ణుని చరిత్ర | 0 9 0 |
| పర్వతీన మహాక్షేత్రము | 0 5 0 | భీష్మ చరిత్ర | 0 9 0 |
| భీష్మ మహిమ | 0 6 0 | నీతిచంద్రిక | 0 8 0 |
| కథారామాయణము | 0 7 0 | శ్రీరామచంద్రమూర్తి | 0 6 6 |
| అభిమన్యుడు | 0 7 0 | తిన్నడు - గుణనిధి | 0 11 0 |
| మోహన (నవల) | 0 7 0 | | |

# శతకములు

| | | | |
|---|---|---|---|
| సుమతి శతకం మూలం | 0 2 0 | ప్రహ్లాద చరిత్ర సప్తమస్కంధము మూలం | 0 8 0 |
| ,, సటీక | 0 4 0 | కృష్ణశతకము మూలం | 0 2 0 |
| దాశరథి శతకము మూలం | 0 2 0 | ,, సటీక | 0 5 0 |
| ,, సటీక | 0 6 0 | భాస్కర శతకము మూలం | 0 2 0 |
| వేమన శతకము మూలం | 0 2 0 | ,, సటీక | 0 10 0 |
| ,, సటీక | 0 5 0 | కుమారీ శతకము మూలం | 0 2 0 |
| నృసింహ శతకము మూలం | 0 3 0 | ,, సటీక | 0 5 0 |
| ,, సటీక | 0 10 0 | బాలరామాయణము మూలం | 0 2 0 |
| సుదతీ సునీతి శతకము మూలం | 0 2 0 | ,, సటీక | 0 4 0 |
| ,, సటీక | 0 5 0 | కుమార శతకము మూలం | 0 2 0 |
| గజేంద్రమోక్షము మూలం | 0 4 0 | , సటీక | 0 5 0 |
| ,, సటీక | 0 10 0 | భర్తృహరి సుభాషిత నీతిశతకము సటీక | 0 6 0 |
| కుచేలోపాఖ్యానము (పోతన) | 0 6 0 | రుక్మిణీ కళ్యాణము | 0 4 0 |
| కుచేలోపాఖ్యానము (గట్టుప్రభువు) | 0 8 0 | ,, సటీక | 0 10 0 |
| భోగినీ దండకము (పోతన) | 0 3 0 | నలోపాఖ్యానము సటీక | 0 10 0 |

# ప్రాథమిక పాఠశాలల బోధన ఉపకరణములు

## బొమ్మల సెట్టు (14″ × 11″ సైజులో)

(మంచి అట్టమీద వేయబడినవి)

ఇంగు 16జంతువులు, 5జలభూచరములు, 10 పక్షులు, 10 పాదులు, తీగెలు, వృక్షములు, మొత్తము 43 గలవు.

సెట్టు 1కి రు. 5–0–0 డజను రు. 1–8–0.

విడిగా ప్రతి 1కి రు 0–2–6.

| | |
|---|---|
| తెలుగు అక్షరముల కొరతము | 0 2 0 |
| ,, అక్షరబోధిని | 0 2 0 |
| ఇంగ్లీషు అక్షరముల కొరతము | 0 2 0 |
| సిలబసుచార్టు నెలవారి, తరగతివారి | |
| సబ్జెక్టువారి 1–3తరగతులకు సెట్టు1కి | 0 8 0 |
| ఇంగ్లీషువర్ణ్సుపెల్లింగుపెట్టె | 0 8 0 |

[ఈ క్రింది ఉపకరణములైన గ్రంథములు గవర్నమెంటువారిచే ఆంగ్లమున ప్రచురింపబడుటచే ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయుల కనువగునట్టులను, అందుబాటులో యుండులాగునను తెలుగున అనువదించి ప్రచురించితిమి. పాఠశాలా నిర్వహణమునకు ముఖ్యావసరములు.]

| | |
|---|---|
| ప్రాథమిక విద్యానిబంధనలు | 0 3 6 |

1939 సం॥రపు ప్రాథమిక విద్యాప్రణాళిక–1941 సం॥రపు జాగ్రఫీ సిలబసుసహా–

| | |
|---|---|
| ఆంధ్రానువాదము | 0 10 0 |
| మద్రాసు ఎలిమెంటరి ఎడ్యుకేషనల్ మాన్యుయల్ | 1 12 0 |

[మం. శంకరయ్య- B A L T. గారిచే]

[ఆంధ్రానువాదము]

ప్రస్తుత ప్రాథమిక పాఠశాలలలోని ఉపాధ్యాయులు కొందరు 1940 సం॥రపు నూతనసిద్ధాంతముల ప్రకారము ట్రయినింగు అయినవారు కానందున 1940 సం॥రపు నూతన ట్రనియింగు ప్రణాళిక ననుసరించి ప్రచురింపబడిన యీ క్రింది పుస్తకములు ప్రతి ప్రాథమిక పాఠశాలలోను బోధించుటకు ముఖ్యావసరములై యున్నవి.

1. బోధనాపద్ధతులు :—

| | |
|---|---|
| i. తెలుగు బోధనాపద్ధతులు | 1 2 0 |
| ii. గణితాబోధనావిధానము | 1 4 0 |
| iii. సృష్టిపరిశీలన – తోటపని | 0 10 0 |
| iv. దేశీయచరిత్ర సివిక్స్ | 0 10 0 |
| v. భూగోళశాస్త్రబోధనా విధానము | 0 9 0 |
| 2. శిశుస్వభావము-విద్య | 1 0 0 |
| 3 గ్రామసాంఘిక సమస్యలు | 1 12 0 |
| 4. పాఠశాలానిర్వాహకత్వము | 1 8 0 |

# ప్రాథమిక పాఠశాలల క్రొత్తనమోనాఫారములు, రిజష్టర్లు

[క్రొత్తగా మారిన రూల్సు ప్రకారము తయారుచేయబడినవి.]

| | |
|---|---|
| ఫారములధరలు 100 కి | |
| నెలసరి లెక్కలు [మంత్లీరిటర్సు] | 2 0 0 |
| డిఫాల్టర్సులిష్టు | 1 0 0 |
| రికార్డుషీటు | 1 12 0 |
| సాలుసరి పరీక్ష స్టేటుమెంటు | 3 8 0 |
| ట్రయినింగుస్కూలు అడ్మిషన్ ఫారములు | 3 0 0 |
| డిటో బేసిక్ ట్రయినింగుఫారములు | 3 0 0 |
| అటెండెన్సు 12 పే॥ 0 6 0 24 పే॥ | 0 12 0 |
| అక్విటెన్సురోలు12. పే॥ 0 6 0 24 పే॥ | 0 12 0 |
| టీచరు అటెండెన్సు 12 పేజీలు | 0 6 0 |
| టీచరు అటెండెన్సు 24 | 0 12 0 |
| అడ్మిషన్ రిజిష్టరు 12 పే॥ 0 6 0 24 పే॥ | 0 12 0 |
| అడ్మిషన్ దరఖాస్తులు | 1 0 0 |
| స్టాగ్నేషను లీష్టు | 1 12 0 |
| విజిటర్ల పుస్తకము 40 పేజీలు | 0 6 0 |
| పిల్ల జనాభారిజిష్టరు 150 యిండ్లకు | 1 6 0 |
| డిటో 300 యిండ్లకు | 2 12 0 |
| జరిమానాల రిజిష్టరు | 0 6 0 |

# ప్రాథమిక పాఠశాలల వివిధపుస్తకములు

| | |
|---|---|
| గణితబోధిని | 0 2 0 |
| ఆంగ్లో తెలుగుప్రైమరు | 0 4 0 |
| వినాయకచవితిపుస్తకము | 0 1 0 |
| ఎక్కముల బుక్కు | 0 1 0 |
| దసరాపద్యములు | 0 2 0 |
| కోలాటకీర్తనములు | 0 2 6 |

గ్రంథాలయములకు

# శ్రీ మదాంధ్ర మహాభాగవతము

[పద్య కావ్యము - పోతన ప్రణీతము]

చక్కని క్యాలికో బైండు

| | | | |
|---|---|---|---|
| సంపూర్ణప్రతి - ఒకే సంపుటము | 12 | 0 | 0 |
| సంపూర్ణప్రతి - రెండు సంపుటములుగా | 14 | 0 | 0 |
| డిటో విడివిడిగా ఒక్కొక్కప్రతి | 7 | 8 | 0 |
| సంపూర్ణప్రతి-మూడు సంపుటములుగా | 16 | 0 | 0 |
| డిటో విడివిడిగా ఒక్కొక్కప్రతి | 6 | 0 | 0 |

# శ్రీమదాంధ్ర మహాభారతము

[పద్యకావ్యము - కవిత్రయ ప్రణీతము]

చక్కని క్యాలికో బైండు

| | | | |
|---|---|---|---|
| 1 ఆది, సభాపర్వములుగల సంపుటము | 4 | 0 | 0 |
| 2 అరణ్యపర్వము | 4 | 0 | 0 |
| 3 విరాటోద్యోగపర్వములు | 4 | 0 | 0 |
| 4 భీష్మ, ద్రోణపర్వములు | 4 | 0 | 0 |
| 5 కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు | 4 | 0 | 0 |
| 7 శాంతిపర్వము | 4 | 0 | 0 |
| 8 ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | 4 | 0 | 0 |
| శ్రీమదాంధ్ర మహాభారతము 7 సంపుటముల సెట్టు | 28 | 0 | 0 |
| డిటో 3 సంపుటములలో | 20 | 0 | 0 |
| 1 ఆదిపంచకము - ఒకే సంపుటము | 10 | 0 | 0 |
| 2 యుద్ధషట్కము - డిటో | 8 | 0 | 0 |
| 3 శాంతిసప్తకము - డిటో | 8 | 0 | 0 |

## శ్రీమదాంధ్ర మహాభారతము

[వచనము] 3 0 0

మహావాది వెంకటరత్నం ప్రణీతము B. A.

[ఆదిపర్వము, సభాపర్వము
రెండు సంపుటములు క్యాలికో]

## భారతం శాంతిపర్వము

[పద్యం, మున్నంగిశర్మ పరిష్కృతము, సులభముగ అర్థమగుటకు పద విరామము తెలుపు గుర్తులతో] 3 0 0

## శ్రీమద్భగవద్గీత (రామానుజ భాష్యము)

ప్రతిపద టీకా భాష్య విశేషార్థ సహితము

| | | | |
|---|---|---|---|
| క్యాలికో బైండు | 10 | 0 | 0 |
| డిటో ఆంధ్ర తాత్పర్యసహితము | | | |
| క్యాలికో బైండు | 2 | 0 | 0 |
| డిటో రేపరు బైండు | 1 | 8 | 0 |
| డిటో మూలం | 0 | 8 | 0 |
| డిటో ఆంధ్రవచనము చిన్నసైజు | 0 | 8 | 0 |
| భాస్కర రామాయణము క్యాలికోబైండు (పద్యకావ్యము) | 8 | 0 | 0 |
| భర్తృహరి సుభాషితము | 4 | 0 | 0 |
| భర్తృహరి సుభాషితము (నీతిశతకము మాత్రము టీక) | 0 | 6 | 0 |
| శ్రీకృష్ణ కర్ణామృతము | 3 | 0 | 0 |
| శ్రీరామకర్ణామృతము | 2 | 8 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము ద్విపద (గౌరన) | 1 | 0 | 0 |
| నలచరిత్ర డిటో | 0 | 10 | 0 |
| మోక్షగుండ రామాయణము | 3 | 8 | 0 |
| [హరికథ] యక్షగానము క్యాలికో | | | |
| మొల్ల రామాయణము | 1 | 0 | 0 |

## అష్టాదశ పురాణసారము (వచనం)

| | | | |
|---|---|---|---|
| 4 భాగములు విడిప్రతి ఒక్కొక్కటి | 1 | 4 | 0 |
| 4 భాగములు క్యాలికో ఒకేసంపుటములో | 5 | 8 | 0 |

భగవన్నుతి - (3 భాగములు) 0-10-0

| | | | |
|---|---|---|---|
| విజ్ఞానలహరి | 0 | 6 | 0 |
| ప్రార్థనదీపిక | 0 | 2 | 0 |

కుశలవ నాటకము 0-12-0

## స్తోత్రములు, సహస్రనామములు

| | | | |
|---|---|---|---|
| శ్రీసహస్రనామ స్తబకము [క్యాలికో] | 1 | 0 | 0 |
| ,, [రేపరు] | 0 | 12 | 0 |
| ముకుందమాల [సటీక తాత్పర్యము] | 0 | 8 | 0 |
| అగస్త్యహృదయము ,, | 0 | 6 | 0 |
| సవితృసర్వస్వము ,, | 0 | 4 | 0 |
| నీతిశాస్త్రము ,, | 0 | 4 | 0 |
| భజగోవిందశ్లోకములు ,, | 0 | 3 | 0 |
| శ్రీ లక్ష్మీనృసింహస్తోత్రము | 0 | 3 | 0 |

| | |
|---|---|
| మహిమ్నస్తోత్రము | 0 4 0 |
| ఆంజనేయ సహస్రనామము | 0 5 0 |
| లలితా సహస్రనామము (అట్టబైండు) | 0 10 0 |
| (క్యాలికో) | 0 12 0 |
| శివసహస్రనామము | 0 5 0 |
| గణపతి సహస్రనామము | 0 5 0 |
| రామసహస్రనామము | 0 5 0 |
| గోపాలసహస్రనామము | 0 5 0 |
| లక్ష్మీసహస్రనామము | 0 5 0 |
| విష్ణుసహస్రనామము | 0 8 0 |
| పితృతర్పణము | 0 2 0 |
| బ్రహ్మయజ్ఞము | 0 2 0 |
| సంధ్యావందనము | 0 6 0 |
| మంత్రపుష్పము | 0 2 0 |
| యూనానీ వైద్యామృతసాగర్ (వైద్యగ్రంథము | 4 0 0 |

గీతా హృదయము

| | |
|---|---|
| [డా॥ శంకర శ్రీరామారావుగారిచే] | 0 12 0 |
| సంగీతాలు | 0 12 0 |

# ఆంధ్ర దశరూపకము

(A Book on Telugu Dramaturgy)

రచయిత.

బ్ర॥ శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు

(Retired Lecturer, Andhra University)

వెల రు. 0-15-0

## జనమంచి శేషాద్రిశర్మగారి గ్రంథములు

### పద్య కావ్యములు

| | |
|---|---|
| ఆంధ్ర శ్రీమద్రామాయణము, నిర్వచనము | |
| 7 సంపుటములు | 18 0 0 |
| 3 సంపుటములు | 15 0 0 |
| బ్రహ్మాండ పురాణము | 6 0 0 |
| తెలుగు బ్రహ్మపురాణము | 5 0 0 |
| పాండవకృష్ణ భాగవతము | 4 0 0 |
| కౌమారికా ఖండము [స్కాందము] | 4 0 0 |
| ధర్మసార రామాయణము | 4 0 0 |
| సర్వమంగళాపరిణయము | 2 0 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | 2 0 0 |
| హనుమద్విజయము | 0 10 0 |
| కవివిలాసము 1 వ భాగము | 1 0 0 |

### వచనములు

| | |
|---|---|
| శ్రీ కృష్ణావతారతత్త్వము 12 సంపుటములు | 21 0 0 |
| ఒకొక్కటి | 1 12 0 |
| శ్రీ రామావతారతత్త్వము 11 సంపుటములు | 19 4 0 |
| ఒకొక్కటి | 1 12 0 |
| ఉత్తమమార్గము | 1 0 0 |
| భగవద్గీత, విపులమగుటీక | 1 8 0 |
| మనుచరిత్ర హృదయావిష్కారణము | 0 12 0 |
| సత్ప్రవర్తనము | 0 12 0 |
| నీతిరత్నావళి | 0 10 0 |

### వివిధ గ్రంథములు

| | |
|---|---|
| వ్యవహారబోధిని 1 భా॥ | 0 5 0 |
| వ్యవహారబోధిని 2 భా॥ | 0 8 0 |
| తెనాలి రామలింగని కథలు | 0 4 0 |
| రామేశ్వరమునకు కథలు | 0 14 0 |
| చంద్రశేఖరశతకము | 0 3 0 |
| భావయదండకము | 0 3 0 |
| ఆంజనేయదండకము | 0 1 0 |
| ధర్మసూక్ష్మం [పద్యకావ్యం] | 0 4 0 |
| హస్తసాముద్రికము | 0 5 0 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు [రేపరు] | 1 0 0 |
| ఉద్గ్రాభంతస్వప్నము | 0 3 0 |

### ఇతరులవి

| | |
|---|---|
| రుక్మిణీకళ్యాణము [అచ్చతెనుగు గబ్బము] | |
| 3 ఆశ్వాసముల మహాప్రబంధము | 0 12 0 |
| కొండవీడు నాటకం | 0 3 0 |
| విలాసిని [పద్యకావ్యము] | 0 6 0 |
| చంద్రకళావిలాసము | 1 0 0 |
| మిటారులసీటు [వచనము] | 0 6 0 |
| పాతాళద్వీపము | 0 4 0 |
| యువయువతీ విద్యాసాహచర్యము | 0 4 0 |

వలయువారు :—

**రామా అండ్ కో., H.O. ఏలూరు.**

బ్రాంచెస్ :—గుంటూరు, రాజమండ్రి, భీమవరం, తెనాలి, విజయనగరం.

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

మాచే ప్రచురింపబడు ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య మాసపత్రిక అనేకమంది విద్యాధికుల, విద్యాధికారుల, మ్యునిసిపాలిటీల జిల్లాబోర్డుల, తెలుగుజిల్లాలలోని అన్ని ప్రాథమికోపాధ్యాయుల, అనేక జనసామాన్యములయొక్క మన్ననలపడసి యున్నది. ఆంధ్రజిల్లాలలోని పెద్దపెద్ద పట్టణములకే గాక, ప్రతి పల్లెకు పంపబడుచున్నది దీనికి చాలమంది చందాదారులుండుటవలన విస్తీర్ణమైన ప్రకటితము గలిగి యున్నది ఇందు అడ్వర్టైజుమెంటు చేసినచో అనేకమందికి పట్టణములలోనేగాక, మూలమూల గ్రామాదులలోకూడ విరివిగా ప్రకటితమగుచుండును. గాన వ్యవహారములు, వ్యాపారములు, వస్తువులు, పుస్తకములు వగైరాలనుగురించిన అడ్వర్టైజుమెంటు వేయువారికి ఇది మంచి సాధనముగా ఉండును. ఈ క్రిందిఉదహరించిన రేట్లప్రకారం అడ్వర్టైజుమెంటుచేయించుకొన దలయువారు పేజీకి ఒకవైపున విపులముగ సిరాతో వ్రాసి మాయీ దిగువ అడ్రసుకు అడ్వర్టైజుమెంటు రేట్లప్రకారము సొమ్ముసహా పంపగోరుచున్నాము.

అడ్వర్టైజుమెంటు రేట్లు

| | పూర్తిపేజీ | అర్ధపేజీ | పావుపేజీ |
|---|---|---|---|
| 1 నెలకు | 10 0 0 | 6 0 0 | 4 0 0 |
| 3 ,, | 25 0 0 | 16 0 0 | 10 0 0 |
| 6 నెలలకు | 45 0 0 | 25 0 0 | 18 0 0 |
| 1 సం॥రకు | 80 0 0 | 48 0 0 | 30 0 0 |

## రామా అండ్ కో., ఏలూరు.

బ్రాంచెస్ — గుంటూరు - రాజమండ్రి - తెనాలి - భీమవరం - విజయనగరం

---

1953 సం॥రం మార్చి **E.S.L.C.** గవర్నమెంటుపరీక్షకు ఉపయుక్తమగు

## లెఖల నోట్సు (గుడ్‌లక్ ఎగ్జామినర్)

**ప్రశ్నలు - జవాబులు**

క్రొత్త ముద్రణ

గవర్నమెంటు పరీక్ష ప్రశ్నపత్రములు 1942 నుంచి 1951 వరకు

**జవాబులు, నూతన ప్రశ్నపత్రములు**

E. S. L. C. గవర్నమెంటు పరీక్ష విద్యార్థులకు పరీక్షయందు చాల ఉపయోగకరముగ నుండునట్లు

నూతన విద్యాప్రణాళిక ననుసరించి తేలికగా బోధపడునట్లు అనుభవముగల

సెకండరీగ్రేడ్ ఉపాధ్యాయుడు

యస్. కె. వి. శేషావతారం గారిచే

రచింపబడినది

వెల రు. 1-4-0

## E. S. L. C. హిష్టరీ, జాగ్రఫీ, సివిక్సుల పరీక్షాగైడు

గ్రంథకర్త: శ్రీ సిద్ధాబత్తుల సుబ్రహ్మణ్యము

ఈ గైడు 8 త. E. S. L. C. పరీక్షకు ఉపయుక్తముగ వ్రాయబడినది. ఇందు హిష్టరీ, జాగ్రఫీ, సివిక్సు సబ్జెక్టులమీద ప్రశ్నలు, అందుకు జవాబులు గలవు. E. S. L. C. గవర్నమెంటు పరీక్షాపత్రములు (1942-1951 వరకు) జవాబులు సహా యిందు చేర్చబడినవి.

వెల రు 1-4-0

## రామా అండ్ కో., H.O. ఏలూరు

బ్రాంచెస్ :— గుంటూరు, రాజమండ్రి, భీమవరం, తెనాలి, విజయనగరం.




## వార్షికోత్సవములు

**పలేశ్వరం ;**

యు. యల్. సి. యమ్. హయ్యరు ఎలిమెంటరీస్కూలు ప్రథమ వార్షికోత్సవము ది 12-5-52 తేదీన శ్రీ ఆకాశపు మల్లికార్జునుడు, B. A. B. Ed. సీనియరు డిప్యూటి ఇన్‌స్పెక్టరుగారి అధ్యక్షత క్రింద జరిగెను. నవీన విద్య - దాని ప్రాముఖ్యమునుగూర్చి అధ్యక్షులవారు చక్కగా ముచ్చటించిరి. వార్షికోత్సవముల వలన ప్రయోజనములను దెలిపిరి. బాలబాలికలచే వినోద ప్రదర్శనములు జరుపబడెను. శ్రీ యల్. దేవానందం గారి వందన సమర్పణముతో సభ జయప్రదముగా ముగిసెను.

—డి. సత్యనారాయణమూర్తి పట్నాయక్, సంయుక్త కార్యదర్శి,

**లంకల గన్నవరం :**

రాజోలుతాలూకా లంకల గన్నవరం బోర్డు ఎలిమెంటరీ స్కూలు వార్షికోత్సవము శ్రీ యర్రంశెట్టి సత్యనారాయణమూర్తిగారి అధ్యక్షతక్రింద ది 5-5-52 తేదీన జయప్రదముగా జరిగెను. రాపాక ఆదినారాయణమూర్తిగారిచే పచ్చివాని వేషము ప్రదర్శింపబడెను' నవారు నేత, రంగుదారములతో కుట్టుట లేసు అల్లుట, నూలువడకుట, మొదలగువానియందు పోటీలు జరిపి, బాలబాలికలకు స్కూలులో తయారైన వలలు, చొక్కాలు, మరికొన్ని పుస్తకములు, బహుమతులుగా ఇవ్వబడెను. వచ్చిన పెద్దలకు అల్పాహార విందు జరిగెను. జాతీయగీతముతో సభముగిసెను.

— మిత్తిపాటి సీతారామాచార్యులు,
హెడ్మాష్టరు.

**ఇంజేడు :**

ఈ గ్రామంలోని బోర్డు ఎలిమెంటరీస్కూలు సాలుసరి పరీక్ష ది 22-4-52 తేదీన కోయిలకుంట్ల రేంజి J. D I. శ్రీ కె. సుబ్బారావు గారిచే జరుపబడెను. ఆ సందర్భములో వారు గ్రామంలోని శ్రీ గాంధి గ్రంథాలయమును దర్శించి అమూల్యసలహాలనిచ్చిరి. తరువాత గ్రంథాలయ నిర్వాహకుల యాజమాన్యమున స్కూలు భవనమునందు శ్రీ సుబ్బారావు గారిచే రచింపబడిన "వయోజనవిద్య" బుఱ్ఱకథ చక్కగా చెప్పబడెను. హెడ్మాష్టరుగారి కృతజ్ఞతాభివందనములతో సభ జయప్రదముగా ముగిసెను.

—బి. సి. వి. సుబ్బరాజు, హెడ్మాష్టరు.

**వెలువలపల్లి :**

అమలాపురం వెస్టురేంజి-వెలువలపల్లి కేంద్ర ప్రాథమికోపాధ్యాయ వార్షికోత్సవము ది 4-5-52 తేదీన వీరవల్లిపాలెం బోర్డు ఎలిమెంటరీ పాఠశాలలో అమలాపురం వెస్టురేంజి సీనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టరు శ్రీ వి. వి. సీతారామాచార్యులు (B.A.B.Ed) గారి అధ్యక్షతక్రింద జరిగినది. పెక్కుమంది గ్రామస్థులు ఉపాధ్యాయినీ, ఉపాధ్యాయులు, బాలబాలికలు, ఈయుత్సవమునందు పాల్గొనిరి. ప్రార్థనానంతరము సెంటరు కార్యదర్శిచే నివేదిక చదువబడెను. అధ్యక్షులవారు ఉపాధ్యాయుల కర్తవ్యమును గురించి ముచ్చటించిరి. తరువాత బాలబాలికలచే "బుర్రకథ" చెప్పబడెను. ఉపాధ్యాయులచే "భక్తరామదాసు, పాలేరు" నాటకములు ప్రదర్శింపబడెను. హరికథాకాలక్షేపము, వీణ పాటకచేరి జరిగెను. విచిత్ర వేషములు ప్రదర్శింపబడెను. ఈ ప్రదర్శనములందు వీరవల్లిపాలెం వాస్తవ్యులు శ్రీ అడపా చంద్రన్న గారు, శ్రీ అంగర నారాయణాచార్యులు గారు, ఎక్కువ శ్రద్ధతీసుకొనిరి. బాలబాలికలకు బహుమతు లివ్వబడెను. వందన సమర్పణముతో సభముగిసెను.

— మండలీక సూర్యనారాయణ, సెక్రటరీ-టి.ఎ. సెంటరు, వెలువలపల్లి.

ANDHRA RASTRA PRARAMBHA VIDYA
Regd. M N. 3766 Vol. 41. - No. 3




ది 15-6-1952 మొ॥ 14-7-1952 వరకు

**మేషం**—సౌఖ్యం-ద్రవ్యలాభము, కార్యవిలంబము, గౌరవప్రపత్తి, శత్రువృద్ధి, బంధువిరోధము, అనవసర వ్యయములు.

**వృషభం**—చలనం-ధనలాభ వ్యయములు, అగ్నిస్పర్శము, చోరభీతి, కుటుంబసౌఖ్యం.

**మిథునం**—ధనలాభము-శుభ కార్యానుకూలము. బంధు మిత్ర సమాగమం, శత్రునాశనం-శరీరానారోగ్యం, దైవసేవ, సత్కథావచన - ధనలాభ శుభలాభ పరంపరాభివృద్ధి సూచనలు - అధికార గౌరవ సమ్మానములు.

**కర్కాటకం**—విద్యాలాభం-తనుతాపం-చంచలత్వము, కోపం వైపరీత్యవ స్త్రీద్రవ్యలాభములు.

**సింహం**—సుఖం-ధనలాభ వ్యయములు-చంచలత్వము-కుటుంబభీతి-వైరము-కోపం-బంధుమిత్ర సమ్మేళనం.

**కన్య**—ప్రయాణం, ధనలాభ వ్యయములు, అధికార సమ్మానము, ప్రజాగౌరవం

**తుల**—తనుతాపం-చిత్తచాంచల్యము, ప్రయాణము, కోపం-లౌకిక వ్యవహారమందత్వము-కార్యాలస్యం.

**వృశ్చికం**—వస్త్రలాభము, సుఖం-ప్రయాణం-విద్యాగోష్ఠి-బంధువర్జనం.

**ధనుస్సు**—ద్రవ్యలాభం-విద్వ్యయము-కుటుంబానారోగ్యం-మానసికాందోళన-ఋణబాధ.

**మకరం**—వస్త్రధనలాభములు-దుష్టబాధ-ద్రవ్యవ్యయము, చిన్నచిన్న ప్రయాణములు జరుగు, పైత్యప్రకోపం బంధు మిత్ర సమాగమము.

**కుంభం**—ధనవ్యయము-దూరప్రయాణం-అనారోగ్యం-పౌరుషం-పట్టుదల-బంధుమిత్ర సుస్నేహసమాగమములు.

**మీనం**—విద్యాగోష్ఠి-ధనవస్త్రలాభం-కార్యలాభం-అధికారగౌరవం-సంతానసుఖం-దైవచింతన.

(ఈ సంవత్సరములో కార్తీకపౌర్ణమి - అశ్వినీనక్షత్రముతో కలియుటవల్ల అక్కడక్కడ దేశములో ధూమకేతుసందర్శనము - గొప్పవారి (ప్రభుజన) పీడలు - మరణపరిస్థితులు - నదీప్రవాహములు - నదులు పొంగుట - వ్యవసాయ నష్టములు - జననాశం - మొత్తముమీద నవంబరు మొదలు 1953 మార్చి వరకు ప్రభువులకు, ప్రజలకు విరోధాలేగాక యుద్ధప్రయత్నములుకూడ జరిగి ఎక్కువ అశాంతి యేర్పడు సూచనలు గనబడుచున్నవి.)



Edited by Sri M. Venkata Ratnam Garu, B. A., & Printed and Published
by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru.